## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్ధం తాము సేకరించిన విలువైన గ్రంధాలను **ఆర్కైవ్** వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ఆర్కైవ్** వారి వెబ్ సైట్: https://archive.org/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు*

## ఆర్కైవ్ వారి వెబ్ సైట్:

## https://archive.org/

Internet Archive: Digital Li ×

https://archive.org

INTERNET ARCHIVE

Web Video Texts Audio Software About Account TVNews OpenLibrary

Universal access to all knowledge

Donate | Store | Blog | FAQ | Jobs | Volunteer Positions

Search: All Media Types Advanced Search Hello Komireddy (not you? sign in or log out) Upload

**Announcements (more)**

Millions of historic images posted to Flickr

Zoia Horn, librarian and activist, dies

Working to Stop Rewriting Copyright Laws via TPP Treaty

**Web 426 billion pages saved over time**

INTERNET ARCHIVE WaybackMachine http:// BROWSE HISTORY

**Welcome to the Archive** RSS

The Internet Archive, a 501(c)(3) non-profit, is building a digital library of Internet sites and other cultural artifacts in digital form. Like a paper library, we provide free access to researchers, historians, scholars, the print disabled, and the general public.

**Video** Browse (by keyword)
1,721,625 movies
Curator's Choice (more)
Noveltoon: The Stupidstitious Cat
A very superstitious cat tries to catch Buzzy for breakfast but Buzzy outsmarts him. Animation by...
Recent Review
Little Ol Bosko In Bagdad
Average rating:

**Live Music** Browse (by band)
131,731 concerts
Curator's Choice (more)
Yarn Live at Towne Crier Cafe on 2014-02-16
01. intro 02. Time Burns On 03. I Hate You 04. Down On Your Luck 05. Lost Cause 06. Christopher...
Recent Review
Grateful Dead Live at Merriweather Post Pavilion on 1985-06-30
Average rating:

**Audio** Browse (by keyword)
2,095,303 recordings
Curator's Choice (more)
contra32: Infex - Type-E
How exactly does one create a golem? Although there are many variations in recorded methods and...
Recent Review
KM/TB Sol Rezza 2014
Average rating:

**Texts** Browse (by keyword)
6,509,320 texts
Curator's Choice (more)
The Orchid world. A monthly illustrated journal...
No more published
Recent Review
الأسطوانة الرابعة 04 - أبحاث علمية - تربية وتعليم
Average rating:

**Most recent posts (write a post by going to a forum) more...**

| Subject | Poster | Forum | Replies | Date |
|---|---|---|---|---|
| PLEASE DELETE | kiwi9000 | forums | 0 | 1 hour ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: Please change identifier | FishAndChipsWVEW | moviesandfilms | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: You don't have to ask, cause you already know | wmonola | GratefulDead | 0 | 2 hours ago |
| Re: HELP!! need shows recommendations | wmonola | GratefulDead | 0 | 2 hours ago |

**Institutional Support**

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# డబ్బేనా!
# మీకు కావలసినది?

P. సూర్యకుమార్

*Concept :*

L. రత్నాజీ, *B,A., D.I.M.S.,D.B.I.M.,*

మల్లికార్జునపేట, విజయవాడ-520 001.

*Edited By :*

తారా దుర్గేశ్వరి అమర, *M.A.*




☎ 08644-23037




జనప్రియ పబ్లికేషన్స్,

అగ్నికుల క్షత్రియుల వారి వీధి-II.

గంగానమ్మపేట, తెనాలి-522 201.

# విషయసూచిక (CONTENTS)

# డబ్బేనా !
# మీకు కావలసినది?

"ప్రపంచములో- తేలికైనదేది" అని అడిగాడట ఒకాయన !

"ఇతరులకు సలహానివ్వడం" అన్నాడట మరో ఆయన !

"అయితే.... నాకో సలహా యిస్తారా ?" అని అడిగాడట.

"అడగండి ! అందులో ఏముంది ?"

"డబ్బు సంపాదించడం ఎలా ?" అని అడిగాడట !

"దాని కేముంది అంతకన్నా సులభమైన పని వేరొకటి లేదు."

"అయితే చెప్పండి ! అర్జంట్‌గా నేను కోటీశ్వరుడ నవ్వాలని వున్నది." "కోటీశ్వరుడైతే.... మీరు నాకేమి ఇస్తారూ ?"

"అవ్వనివ్వండి ! అప్పు డాలోచిద్దాము !!"

"అయిన తరువాత మీరు ఇక ఆలోచించే అవసరము వుండదు ! అవకాశము వుండదు ! కనుక.... మీ రివ్వదలచుకున్నదేదో ఇప్పుడే చెప్పండి !" అని ఆ పెద్ద మనిషి ఈ అడిగిన మనిషిని ఇఱకాటములో పెట్టేసాడు. ఇతనికేమి చేయాలో తెలియలేదు.

డబ్బు సంపాదించాలంటే.... తెలివి-తేట లుండాలి. ఆ తెలివి-తేటలు అందఱి సొత్తు కాదు. తెలివి-తేటలు మాత్రమే ఉంటే.... సరిపోదు. వాటితోపాటు అదృష్టముకూడా కలసి రావాలి. "తాటికాయంత తెలివి-తేటలికన్నా.... ఆవగింజంత అదృష్టము మిన్న" అన్నాడొక కవి ! పూర్వము- కవులను, పండితులను రాజులు పోషించేవారు. ఇప్పుడు రాజు లంతరించిపోయారు. మనకు ప్రజలే రాజులు ! కనుక.... ప్రజలే వారిని పోషించాలి.

రాజులంటే.... ఒక చిన్న కథ ఒకటి గుర్తుకొచ్చింది. పూర్వము ఒక రాజుగారు- ఇద్దరు బ్రాహ్మణులను పిలిచి, వారి తెలివి-తేటలను తెలిసికొనుటకు ఆ ఇద్దరికీ చెరొక రూపాయి ఇచ్చారుట! అందులో ఒక బ్రాహ్మణుడు రాజుగారిచ్చిన రూపాయను సాయంత్రానికే ఖర్చుచేసేసాడట!

రెండవ బ్రాహ్మణుడు తన తెలివి-తేటలతో పొదుపుగా ఖర్చు చేయడమే గాక.... రెండవ బ్రాహ్మణుని పిలిచి "నువ్వు నావద్ద పని చేస్తావా? నీకు నెలకు ముప్పది రూపాయల జీతము యిస్తాను. రెండు పూటలా భోజనము పెడతాను" అని అన్నాడట! రెండవ బ్రాహ్మణుడు తన రూపాయని ఖర్చు చేసినాడు కనుక.... అతనికి వేఱు గత్యంతరము లేక మొదటి వాని వద్దకు పని చేయుటకు అంగీకరించాడు.

"నేనేమి చేయాలి?" అని అడిగాడు రెండవ బ్రాహ్మణుడు- మొదటి బ్రాహ్మణుడిని!

"నీవు ఉదయమే నా వద్దకు రావాలి. ఈ రాగి చెంబును బాగా తోమాలి. మధ్యాహ్నము వరకు ఊళ్ళో భిక్షాటనకు వెళ్ళాలి. ఊరిలో- గృహస్థులు వేసిన బియ్యమును, వారు యిచ్చిన కూరగాయలను తెచ్చి: వాటిలో- మనిద్దరికి సరిపోయినన్ని బియ్యము, కూరగాయలను తీసి వండాలి. మిగిలిన బియ్యము, కూరగాయలను- అంగడికి తీసుకుని వెళ్ళి అమ్మాలి. ఆ డబ్బును తెచ్చి, రోజూ నాకు ఇవ్వాలి. నువ్వు పగలు వండే అన్నము, కూరలను మనిద్దరమూ రెండు పూటలా తిందాము తెలిసినదా? అదే నీవు చేయవలసిన పని" అన్నాడు- మొదటి బ్రాహ్మణుడు!

అందుకు రెండవ బ్రాహ్మణుడు అంగీకరించాడు. మొదటి బ్రాహ్మణుడు- ఇంటినుండి కాలు కదపకుండా.... రెండవ బ్రాహ్మణునిచేత అన్ని పనులను చేయించుకుంటున్నాడు.

ఒక సంవత్సరము జరిగినది. ఒకరోజు రాజుగారు ఆ ఊరికి- రాత్రిపూట రహస్య పర్యటనకు వెళ్ళి, అక్కడ క్రొత్తగా నిర్మించబడిన ఇంటిని చూచి, "ఇది ఎవరిల్లు?" అని మంత్రిని అడిగారు.

అప్పుడు మంత్రి "ప్రభూ ! మీరు సంవత్సరము క్రిందట ఇద్దరు బ్రాహ్మణులను పిలిచి, రెండు రూపాయలను వారిద్దరికీ ఇచ్చారు ? వారిలో ఒకరు ఆ రూపాయను సొంతంత్రానికే ఖర్చుచేసి, రెండవ బ్రాహ్మణుని వద్ద ఉద్యోగానికి చేరాడు. ఆ రెండవ బ్రాహ్మణుడు- తన తెలివితేటల నుపయోగించి, మొదటి వాని కాయకష్టముతో తాను బ్రతుకుతూ.... ఆ బ్రాహ్మణునకు జీతమిస్తూ, ఆహారముపెట్టి పోషిస్తూ, ఈ ఇంటిని కూడా కట్టుకున్నాడు" అని వివరించాడు. రాజు ఆశ్చర్యచకితుడై, ఆ బ్రాహ్మణుని తెలివి-తేటలకు మెచ్చికొని, అతనికి మరింత ద్రవ్య సహాయము చేసాడు.

పై కథను పరిశీలించి చూస్తే.... మనిషి డబ్బు సంపాదించుటకు విద్య ఒక్కటే చాలదు. తెలివి-తేటలన్నవి ఒక్క విద్య తోనే మనిషికి అబ్బవు. విద్యలేని వా రెందరో తెలివైన వా రున్నారు. వారు- వారి కృషి వలన పైకొచ్చారు. విద్యావంతులెందరో అటువంటి తెలివైన వారి వద్ద ఉద్యోగములను చేస్తున్నారు. విద్యవున్నా, తెలివి-తేటలున్నా వీటన్నిటి కన్నా అదృష్టము (అవకాశము) కూడా వుండాలి. అప్పుడు మనము తల పెట్టింది సక్సెస్ అవుతుంది.

మనిషి డబ్బు సంపాదించుటకు అనేక మార్గములు ఉన్నాయి. ఐతే.. అతడు ఎల్లప్పుడూ మంచి మార్గమునే ఎన్నుకోవాలి. దొంగతనములు, దోపిడీలు, మోసము చేసి, డబ్బు సంపాదించరాదు. అది అట్టే కాలము నిలువదు. ఏదో ఒకరోజు ప్రమాదమును తెస్తుంది.

ఋజుమార్గములో తెలివి-తేటల నుపయోగించి డబ్బు సంపాదించుటకు తీవ్రముగా అన్వేషించాలి. డబ్బు సంపాదించుట చాల సులభమనుకున్నా రేమో ? కానేకాదు.... కష్టపడితేనే గానీ ఫలితము దక్కదు. ఫలితము దక్కితేనే గానీ డబ్బురాదు. "ధన మూల మిదం జగత్" అన్నారు మన పెద్దలు ! డబ్బు సంపాదించుట వలన సంఘములో గౌరవము పెరుగుతుంది. ప్రజలు మిమ్ములను అందలమెక్కిస్తారు. మీ చుట్టూ ప్రదక్షిణములు చేస్తారు వారి పనులను- మీ చేత చేయించుకొనుటకు నానా పాట్లు పడతారు. మిమ్ములను 'కాకా' పడతారు.

ఎందరో రాజకీయ నాయకులు- కాంట్రాక్టర్స్ చేతులలో వున్నవారే! కాంట్రాక్టర్స్ రాజకీయ నాయకులకు ఎలెక్షన్ సందర్భములో భూరివిరాళము లను ఇచ్చి వారిని ఉంచుకుంటారు. ఆ తరువాత నాయకులు పదవులలోనికి వచ్చిన తరువాత వీరి సహాయమునకు ప్రతిఫలమును అందిస్తారు.

మనకు "ఫలితము" అనగానే.... బిల్డాలు, టూకాలే గుర్తుకొస్తాయి. అంతే.... వాటి వెనుక వున్న బృహత్తర కృషి "వారు ఆ స్థాయికి ఎలా చేరినారు" అన్న అంశములను గమనించము. మనము దానికి గల కారణములను తెలిసికోవాలి. 'రోమ్' నగరమును- ఒక్కరోజులో కట్ట లేదు. ఎంతోమంది కూలీలు- కష్టించి, నిర్మించారు. కష్టించేవాడు ఎప్పుడూ తాను సుఖపడడు. "తన తరువాతి తరమువారు సుఖపడాల"ని అను కుంటాడు.

సత్రములను, తటాకములను నిర్మించువారు; వృక్షములను నాటు వారు ఇట్టి దాతలు తమ కొరకు ఏదీ చేయరు. కాని.... వారి దాతృత్వము భావితరాల వారికెంతో ఉపయుక్తముగా వుంటుంది.

మనము తింటే.... మన కడుపు నిండుతుంది. మనము ఇతరులకు పెడితే.... మన మనస్సు నిండుతుంది. మానసిక సంతృప్తి అన్నింటికన్నా కడు గొప్పది.

## మీ వృత్తిని-మీరు గౌరవించాలి

మీరు చేస్తూ వున్నపని- అతి చిన్నది గానీ, అతి పెద్దది గానీ, దానిని మీరు గౌరవించాలి. దానియందు మీ శ్రద్ధాభక్తుల నుంచాలి. అందరూ మొదటే ఆఫీసర్స్ కాలేరు. క్రింది స్థాయి నుండి పై స్థాయికి ఎదగాలి. అప్పుడు మనిషికి అనుభవము వస్తుంది. ప్రతీ చిన్న విషయమూ అవగత మౌతుంది. క్రిందివారి కష్ట-సుఖములను వారు అర్థము చేసికోగలుగు తారు. ఎక్కువమంది చిన్న గుమాస్తాగానే తమ జీవితమును ప్రారంభిస్తారు. రాను రాను అనుభవము గడించి, పై పదవులలోనికి పోగలుగుతాడు వీరికి

తమ పనిమీద వున్న గౌరవము, శ్రద్ధ, కృషి వారినే పై స్థాయికి వెళ్ళేలా చేస్తాయి.

పెద్ద పెద్ద ఆఫీసర్స్ వారి కుమారులను వారి ఆఫీసులలోనే అసిస్టెంట్స్‌గా నియమిస్తారు. అనుభవము వచ్చిన తరువాత వారికి ప్రమోషన్స్ ఇస్తారు అది వారి ప్రిస్టేజ్‌కి భంగమని అనుకోరు.

ఫోర్డ్, రాక్‌ఫిల్లర్ వంటి ప్రపంచ ప్రఖ్యాత పారిశ్రామికవేత్తలు తమ కుమారులను తమ కుటుంబ సంస్థలలో- క్రింది స్థాయి కార్మికులుగా నియమించి, వారిని మరింత క్రమశిక్షణతో- ఇతరులకన్నా మరింత కఠినముగా తమ కుమారులను విమర్శిస్తూ.... బాధ్యతలనుండి తప్పించుకోకుండా చూసేవారు. పుత్రులైనా సరే.... పదవులలో ప్రమోషన్స్ ఇవ్వాలంటే.... కేవలం 'మెరిట్', సమర్థత ఉంటేనే ఇచ్చేవారు. వారు స్వంత సంతానమనే భావన అసలు ఉండేది కాదు. అందుకే.... వారి సంస్థలన్నీ ప్రపంచవ్యాప్తముగా ప్రఖ్యాతిని పొందాయి.

ముందుగానే ఆఫీసర్ పదవినిగానీ, మేనేజర్ పదవినిగాని ఇస్తే.... క్రింది స్థాయి గుమాస్తాలు ఏమి చేస్తున్నది వారికి తెలియదు. ముందుగా వారు అన్ని స్థాయిలలోని గుమాస్తాల పనితీరులను, విధానములను క్షుణ్ణముగా తెలిసికోవాలి. ఆఫీసర్స్‌గాని, మేనేజర్స్‌గాని వారి క్రింద పనిచేసే వారిమీద పూర్తిగా ఆధారపడకూడదు. అలా చేయుటవలన అనేక అనర్థములకు దారితీస్తుంది. క్రిందివారు- పైవారి అసమర్థతను గ్రహించి, వారి ఇష్టమొచ్చినట్లుగా ప్రవర్తిస్తూ వుంటారు. వారు చెప్పినదే వేదము! పరిశ్రమ అలాంటి పరిస్థితులలో దెబ్బతినే అవకాశము వున్నది. కాబట్టి ప్రతీ చిన్న విషయము అధికారికి తెలియాలి అసమర్థత, అలసత్వము, అవినీతి, దుర్వినియోగము, ద్రవ్యనష్టము చివరికి పరిశ్రమ మూతపడుతుంది.

పాశ్చాత్య దేశములలో ప్రతీ విషయమునూ- పరిశ్రమలోని ఎగ్జిక్యూటివ్స్ కూలంకషముగా అధ్యయనము చేస్తారు. లోపములను గ్రహిస్తారు. వాటిని సరిచేయుట ఎలాగో తెలుసుకుంటారు. అందులో క్షుణ్ణ

ముగా తర్ఫీదును పొందుతారు. ఆ తరువాతే అధికారిగా చేయబడతారు. అధికారమును చేబడతారు. అందుచేతనే.... మనదేశములోని పారిశ్రామిక సంస్థలకన్నా.... పాశ్చాత్యదేశముల పారిశ్రామిక సంస్థలు ఎంతో సమర్థవంతముగా పనిచేస్తాయి. వాటికి లాభములు కూడా అదే స్థాయిలో వస్తాయి. పరిశ్రమల వఱకు వర్కర్స్‌పై ఆధిపత్యమున్నవారికి వారు చేసేపని తెలిసిపోతుంది. అంతేకాకుండా.... వారికి సాంకేతికపరమైన విజ్ఞానము వుండాలి.

మనదేశములో కాలేజ్ చదువులు పూర్తికాగానే.... పరిశ్రమలలో అధికారులుగా అడుగుపెడతారు. వారికేమి అనుభవము వుంటుంది. వర్కర్స్ వారి పనులను గురించి వారికేమి తెలుసు.

అలాగే విద్యార్థిదశలోనే ఎన్నో జర్నల్స్‌ను ప్రారంభిస్తారు. ఇట్టి వారికి జర్నలిజమ్‌లో ఏమి అనుభవము వుంటుంది. అట్టి పరిస్థితులలో నష్ట పోయామంటే.... విచిత్రమేమున్నది.

"లార్డ్ నార్త్‌క్లిఫ్" అనే ప్రముఖ జర్నలిస్ట్ తను చనిపోయేనాటికి **110** పేపర్స్‌కి, మేగజైన్స్‌కి సంపాదకునిగా పనిచేసాడు. అతడిని "నెపోలియన్ ఆఫ్ ది ప్రెస్" అని అన్నారు. అతని పేపర్‌ల సర్క్యులేషన్ ఎంతో మీకు తెలుసా? 55 మిలియన్స్! అతను తన జీవితమును పేపర్‌బాయ్‌గా ప్రారంభించి; అనంతరము కంపోజిటర్‌గా చేరి, అత్యున్నత పదవిని అలంకరించాడు. అతని రచనల ద్వారా ప్రపంచ ప్రభుత్వాలనే పడగొట్టగలిగాడు ! నిలబెట్టగలిగాడు !! దేశపురోగమనమునకు జర్నలిస్టు వెన్నెముక వంటివాడు. రాజకీయ పరిణామములను సరియైన విధముగా గమనించి, పరిశీలించి, పరిశోధించి, పరివర్తనా క్రమమును ఆకాంక్ష చేయుచు; దేశ ప్రగతిని అంచనా వేయగలిగినవాడే- నిజమైన, నిజాయితీపరుడైన జర్నలిస్టు! ఊహాగానములుచేసి, ప్రజలనాడిని తప్పుడు అంచనాలు వేసేవాడు "జర్నలిస్ట్" అనిపించుకోడు.

జర్నలిస్ట్ తన రచనలద్వారా- ఇటు ప్రజలలో, అటు ప్రభుత్వ ములో కనువిప్పును సాధించగలుగుతాడు. ప్రగతిగామిగా తన స్థానమును స్థిరపఱచుకుంటాడు. రాబోయే రాజకీయ పరిణామములను యథాతథముగా అంచనా వేయగలుగుతాడు. అతడే నిజమైన 'మార్గదర్శి!' అతని సూచనలే దేశ భవిష్యత్తుకు బంగారుబాటలు! ! 'లార్డ్ నార్త్‌క్లిఫ్' మొదటి ప్రపంచ యుద్ధకాలములో తన రచనల మూలకముగా 'ఎస్క్విత్'ను ప్రధాని పదవి నుండి తొలగించి, అతని స్థానములో- 'లాయిడ్ జార్జ్' ప్రధాని అయ్యేట్లు చేసాడు. లాయడ్ జార్జ్ తాను బడ్జెట్‌ను ప్రతిపాదించే ముందు 'ప్రెస్‌బార్'ను సంప్రదించేవాడు.

వృత్తిలో- అనుభవము లేకపోతే... బాగా డబ్బున్న ఒక ఆసామి తన కుమారుని కాలేజ్ చదువు పూర్తికాగానే.... పెద్దఎత్తున పెట్టుబడి పెట్టి, అతనిచేత ఒక 'మాసపత్రిక'ను పెట్టించాడు. ఆ కుఱ్ఱవాడికి జర్నలిజమ్‌లో అనుభవములేదు. అతను స్కూల్‌నందు మేగజైన్స్ చదువుకునే రోజులలో ఒక బుల్లి కథ రాసాడట! అదే అతని రచనానుభవము! ఆ పత్రికకు ప్రఖ్యాత రచయితలచేత హెచ్చు పారితోషికము లిచ్చి, వ్యాసాలు రాయించేవాడు. కాని ఆ పత్రికను ఎవ్వరూ కొనలేదు. దానికి ఆదరణ లేదు. పెట్టుబడి పోయినది. సంవత్సరము తిరగకముందే... ఆ పత్రిక మూతపడిపోయినది. అనుభవములేని వ్యాపారము ఇలాగే వుంటుంది. జీవితములో విజయము సాధించాలంటే.... ఏ రంగములోనైనాసరే.... అనుభవము వుండాలి. "విజయము" అంటేనే.... "డబ్బు సంపాదన" అని తెలిసికోండి! డబ్బు లేని విజయము- "విజయము" అని పించుకోదు. ప్రతివ్యక్తి- విజయముతోపాటు, ఆర్థిక విజయమును కూడా ఆశిస్తాడు.

మీరు డిస్ట్రిక్ట్ మునిసబ్‌గా సెలెక్ట్ అయినా.... గ్రామకరణముల వద్ద కొంతకాలము తర్ఫీదు పొందవలసినదే! ప్లీడర్ కోర్స్,పాస్ ఐనంత మాత్రము చేతనే వారికి అనుభవము రాదుకదా! కరణము, మునసబ్‌లు

గ్రామములలో చేసే పనులు వీరికి తెలియవు కదా!! లింకులు, అంకణములు, అష్టంగులు మొదలైన ఎన్నో పారిభాషిక విషయాలు; అలాగే సం॥ 10 అక్కౌంట్స్, ప్లాన్స్ మొదలైనవి తెలిసికోవాలి. ట్రైనింగ్ పొందాలి. ఒక్కమాటలో చెప్పాలంటే... అనుభవమునకు మించిన చదువు మరొకటిలేదు. మేడమెదకు ఎక్కాలంటే.... ప్రతీ వ్యక్తి మేడ మొదటిమెట్టు మీద కాలు పెట్టవలసినదే!

కృషి - డబ్బు - మానవుడు కృషితో అత్యున్నత స్థాయికి ఎదుగుతాడనే విషయము నిర్వివాదాంశము! నిశ్చయము!! కాని.... ఆ కృషి సన్మార్గములో జరగాలి. మీ కృషి వలన ఇతరులు నష్టపోరాదు. "ఎవరినో అన్యాయముచేసి, మనము పైకి రావాల"ని కోరుకోకూడదు. ఇతరులను ఆర్థికముగా నష్టపఱచి, మనము ఆర్థికముగా లబ్ధి పొందకూడదు. అది ముమ్మాటికి నేరము !

"మనము చేసే ప్రతీ పనినీ గౌరవించాల"ని తెలుసుకున్నాము! అదేవిధముగా మన మీద మనము చేసే పనిమీద మనకి అకుంఠిత విశ్వాసము వుండాలి. నమ్మకము వుండాలి. నమ్మకముల వలన నష్టముల కన్నా... లాభములే హెచ్చుగా వుంటాయి. మనము దీక్షతో, పట్టుదలతో, నమ్మకముతో ప్రతీపనినీ చేస్తాము. అప్పుడే మనము అఖండ విజయము సాధించగలుగుతాము.

రాకెట్ స్పీడ్‌తో మన ప్రపంచము ముందుకు సాగిపోతూ వున్నది. మనకంటే పాశ్చాత్య దేశములు మరింత త్వరితగతిని ముందుకు సాగిపోతున్నాయి. ఎంతో పురోభివృద్ధిని సాధించాయి. ప్రతీ మనిషికీ అవసరము లెన్నో వుంటాయి. అవి తీరాలంటే డబ్బు కావాలి. ఆ అవసరాలు తీర్చుకొనుటకైనా ధనమును సంపాదించాలి. అందుకు కృషి అవసరము! "కృషితో నాస్తి దుర్భిక్షం!" అన్నారు కదా! కృషి చేయనిదే ఫలితము ఎలా వస్తుంది. ఇతరుల శ్రమమీద, కృషిమీద మనము హెచ్చుగా ఆధారపడరాదు. మనము మన కృషినే విశ్వసించాలి. "కోరికలు చిన్నవా?

పెద్దవా??" అని కాదు సమస్య! ఎంత చిన్న కోరికైనా- తీరాలంటే.... దానికి డబ్బు అవసరమౌతుంది. మనము ధనమును సంపాదించనిదే .. మన కోరిక ఎలా తీరుతుంది ?

## కోరికే... ధనార్జనకు మూలము !

ఎవరి కోరికలు వారివి! చిన్నవారి కోరికలు- చిన్నవారివి! ! పెద్ద వారి కోరికలు పెద్దవారివి!!! ఆడవారి కోరికలు ఆడవారివి!!!! అవసరాలు అనునిత్యమూ మానవులతో అతి సన్నిహితముగా కాపురము చేస్తూ వుంటాయి. ఇవి మనిషితో పాటే- సహవాసము, సహజీవనము చేస్తూ వుంటాయి. వాటికి ఖరీదుతో నిమిత్తము లేదు. "పొందగలనా ? లేదా ??" అన్న ప్రసక్తిలేదు. అందుకు "మనము అర్హులమా ? కాదా ? ?" అన్న మీమాంస లేదు. కోరిక- మన మనస్సులో ప్రవేసించడమే తడవుగా.... మన బుద్ధి దాని మీద పనిచేస్తూ వుంటుంది. అహర్నిశలు దానిని సాధించా లనే తపన విపరీతముగా వుంటుంది. అది మెదడును కలచివేస్తూ వుంటుంది.

అసలు మనిషికి "తపన" అన్నది లేకపోతే.... అతనికి మనుగడే లేదు. ఏ పనినీ సాధించలేడు. కోరిక అన్నింటికీ మూలము ! అరి షడ్వర్గాలలో-"కామము" అంటే కోరిక మొదటిది తరువాత అది తీరక పోతే.... 'క్రోధము' పెరుగుతుంది. ఇది రెండవది ! మూడవది 'లోభము!' దీనిమీద మనిషికి విపరీతమైన ఇది ప్రేమ! ఇది తనకే దక్కా- లన్న 'లోభచింతన' నాలుగవది. "మోహము" అంటే.... తాను కోరిన దానిని ఎలాగైనా పొందాలనే అమితమైన పట్టుదల ! దీనిని సాధించుటకు కావలసిన ఆత్మ విశ్వాసము, ఆత్మబలము "మదము" అనిపించుకుంటుంది. 'మధము' దెబ్బతింటే కలిగేది- ఆరవదైన "మాత్సర్యము !" ఇతరుల మీద అంటే కోరిక తీరకపోవుటకు కారకులైన వారిమీద కలిగే 'ద్వేషము'నే "మాత్సర్యము" అంటారు.

# అవసరములు-ధనార్జన

మానవుని మనుగడకు- "ఈ రోజు, రేపు" అనేవి దర్పణము వంటిది. "దర్పణము" అంటే 'అద్దము' అన్నమాట! ఈ రోజు కోరుకొనుట, రేపు దానిని తీర్చుకొనుటకు ప్రయత్నించుట ! ఇది మానవ జీవితములోని ఇతివృత్తముగా సాగుతూ వస్తూ వున్నది. కోరికలు వేరు ! అవసరము వేరు !

కుటుంబమునకు ప్రప్రథమము కావలసినది ఆహారము ! ఇది అత్యంత ప్రధానమైన 'అవసరము !' ఇది కోరిక అనిపించుకోదు. రెండవది- అన్నింటినీ మించినది కట్టుకునేందుకు 'బట్ట' ఇది అతి ముఖ్యము ! మూడవది- కుటుంబ సభ్యులు సేద తీర్చికొనుటకు ఇల్లు చాల అవసరము ! అత్యంత ప్రధానమైన, కీలకమైన, మానమునకు సంబంధించిన అవసరములు గనుక.... "తిండి, బట్ట, ఇల్లు" అనునవి 'అవసరము!' మిగతావన్నీ 'కోరికలు ! ?'

ఆడంబరములు : ఇవి రెండు రకములు : 1] సాధారణ ఆడంబరములు, 2] ఆకర్షణతో కూడుకున్న ఆడంబరములు ! వీటిని తమ ఆర్జనకు లోబడి తీర్చుకోవాలి. తన ఆర్జనాశక్తికి మించి వీటిని గురించి ఆలోచించకూడదు.

మనిషికీ మనిషికీ మధ్య ఆకర్షణలతో తేడాలు వుంటాయి. కోరికలలో తేడాలు ఉంటాయి. అవి వారి వారి మనస్తత్వముల బట్టి మారుతూ వుంటాయి. కుటుంబ సభ్యులందరికీ అవసరమనుకున్న వాటిని ఆర్జించవలసిన బాధ్యత కుటుంబ పెద్ద మీద వుంటుంది. మిగతా ఆకర్షణీయమైన ఆడంబరములను సమకూర్చవలసిన బాధ్యత కుటుంబ పెద్దమీద వుండదు. అయినా.... కుటుంబ సభ్యుల ప్రేమ, ఆదరణ, అభిమానములను పొందవలసిన బాధ్యత కుటుంబ పెద్దమీద వుంటుంది. కనుక.... కనీస అవసరములను ఆయన తీర్చవలసిన బాధ్యతను కలిగి వుంటాడు.

మనిషికి సంపాదనే 'వృత్తి' కాకూడదు. వృత్తిలో సంపాదించుట

నేరము కాదు. వృత్తిని చేపట్టుటలోని అంతర్యము- సంపాదన కొరకు మాత్రమే! అందులోను- "నైతిక సంపాదన" "అవినీతి పరమైన సంపాదన" అని రెండు రకములు !

అవసరముల మేరకే సంపాదన పరిమితమై వుంటుంది. సంపాదన- కుటుంబ పోషణ, కుటుంబ అవసరములను తీర్చుకొనుటకేగాక.... ఇల్లు, వాహనములు ఆపైన వేడుకలు, బంధువులు, పండుగలు పబ్బములు ప్రతి ఇంటికీ ఇవన్నీ అవసరములే! ఇవిగాక.... రోగములు, మందులు, వైద్య ఖర్చులు వీటి కొరకు సంపాదించుట అత్యవసరమైనది. కష్టపడి, వృత్తి ధర్మమును- పాటించుట స్త్రీకిగాని, పురుషునికి గాని సహజము ! అందులో దుర్నీతికి తావు వుండరాదు. దుర్నీతి, సంపాదనలో గాని, ఖర్చులోగాని వుండకూడదు. మనిషికి నమ్మతమే-ప్రాణము! నమ్మకము లేకపోతే.... ఏ పనీ జరుగదు.

## ధనార్జన-ధర్మములు

నది నుండిగానీ, చెరువు నుండిగానీ-నీరు తెచ్చికోవాలంటే.... ఒక పాత్రను తీసుకుని వెళ్ళాలి. నీ పాత్ర పరిణామమును బట్టి నీకు నీరు లభిస్తుంది. అదే విధముగా మానవ జీవితములోని 'పాత్ర' ననుసరించి పనులు ఉంటాయి. ధర్మమును తప్పి ప్రవర్తించరాదు. సర్కస్‌లో త్రాడుమీద నడిచేవాడు- చివర వఅకు బాలెన్స్‌ను తప్పకూడదు. అదే విధముగా జీవితములో కూడా బ్యాలెన్స్‌ను తప్పకూడదు. చేసే ప్రతీ పనినీ మీరు శ్రద్ధా పూరితముగా చేయాలి. పనియందు- మనస్సు, జ్ఞానము, కృషి ఈ మూడు త్రివేణీ సంగమములా ముడిపడి వుండాలి అప్పుడే మనము చేసే పని సఫలీకృతము అవుతుంది. అది పెద్దదైనా, చిన్నదైనా శ్రద్ధను చూపాలి. మనిషికి అహంకారము వుండకూడదు. అహంకారము అతని పతనమునకు దారితీస్తుంది. లక్ష్యమును దూరము చేస్తుంది. మానవుడు ఏ ప్రలోభమునకు లోనుకాకూడదు. మనము వంద మొక్కలను నాటుతాము.

కాని అన్నీ ఒకేలా ఫలించవు. కొన్ని ఎక్కువ ఫలిస్తే.... మరికొన్ని అస్సలు ఫలమును ఇవ్వవు. అయినా.... మన కృషిలో లోపము మాత్రము వుండకూడదు.

డబ్బు సంపాదించే మార్గములో అనేక అడ్డంకులు వస్తాయి. అడ్డదారులను తొక్కవలసిన అవకాశములు వస్తాయి. కాని.... వాటి జోలికి పోరాదు. అడ్డంకులను ఖాతరు చేయరాదు. ధర్మమార్గమును విడువరాదు.

"పై సూత్రములను పాటిస్తే.... మనము అంత డబ్బు సంపాదించుట కల్ల!" అన్నాడు సురేష్! "అవినీతి, అడ్డదారిలో పోయే మహామహులందరు లక్షాధికారులు, కోటీశ్వరులు అయ్యారు. ముక్కుమూసుకుని కూర్చుంటే.... మనకు దక్కేది సన్యాసమే! మనస్సాక్షికి- న్యాయదేవత కళ్ళకు కట్టినట్లుగా కాస్సేపు నల్లగుడ్డను కట్టివేయండి! పనికాగానే.... గుడ్డలను ఊడదీయండి! అప్పుడు మనస్సాక్షి కళ్ళతో చూస్తుంది. మన పని ఐన తరువాత అది చూచినా.... ఫరవాలేదు."

"ఇది ఏమి లాజిక్! ఇటువంటి తప్పుడు ప్రచారము తగదు- సురేష్!" అన్నాడు నరేష్!"

సురేష్‌ది- దుర్మార్గము! నరేష్‌ది-సన్మార్గము! దుర్మార్గము తాత్కాలికముగా బాగున్నా.... పర్మెనెంట్‌గా మాత్రము దానికి పతనము తప్పదు. సన్మార్గమే ఎప్పటికైనా మంచిది. ఇందులో ఎక్కువ డబ్బు రాకపోయినా... శాశ్వతమైన కీర్తిని తెచ్చిపెడుతుంది. మీరు కేవలము మెటీరియలిస్ట్‌గా ఆలోచించకూడదు. కొంత ప్రాక్టికల్‌గా కూడా ఆలోచించాలి. అతి సంపాదన అవినీతికి దారితీస్తుంది. మనము క్షేమముగా జీవించుటకు మాత్రమే సంపాదించుట మంచిది. జీవితమునకు మలయమారుతము వుండాలిగానీ.... ఝంఝామారుతము వుండకూడదు. మలయమారుతము మన జీవితమునకు హాయిని కలిగిస్తుంది. ఝంఝామారుతము మన జీవితమునకు పనికిరాదు. మనకు నిత్య జీవితములో అతి ఎత్తుకు పెరిగిన వృక్షములు మాత్రమే కనిపిస్తారు. అట్టడుగున వున్న వారెవరిని చూడము. బాగా పెరిగినవారు

చాల కొద్ది సంఖ్యలో వుంటారు. అది ఏ రంగములోనైనా కనబడే సత్యము.

వ్యాపారరంగమును తీసుకుంటే.... మనకు టాటాలు, బిర్లాలు కనిపిస్తారు. చిత్రరంగమును తీసుకుంటే.... మనకి రామారావు, నాగేశ్వరరావు, శివాజీ, రామచంద్రన్, అమితాబచ్చన్‌లు మాత్రమే కనిపిస్తారు. వారి క్రింది వారెవరినీ గుర్తించము ! మంచి స్థాయిని అందులో లేనివారి సంఖ్య- లక్షలలో వుంటుంది. మంచి స్థాయి నందుకున్నవారు- ఎంతో కృషి, శ్రమ, పట్టుదల లేకుండా ఆ లెవల్‌కు వెళ్ళలేదు.

ఈ రోజున అత్యుత్తమ హోదాలో వున్నవారు ఒకప్పుడు అట్టడుగున వున్నవారే ! మనిషికి "మనీ" అన్నది చాల అవసరము ! అది ఈనాడు మనిషికి ఊపిరిగా మారిపోయినది. అతని ప్రాణవాయువుగా మారిపోయినది. 'మనీ' లేనిదే.... మనిషికి మనుగడ లేదన్న భావనలకు మానవుడు దిగజారిపోయాడు. ఆ భావనే.... మనిషిని డబ్బు సంపాదించే యంత్రముగా మార్చివేసినది. డబ్బు వుండవలసినదే కానీ.... డబ్బు సంపాదించేమార్గము మంచిదై వుండాలి. ఉత్తమమైనదై వుండాలి దొంగతనములు, దోపిడీలు, హత్యలను చేసి, హింసామార్గములో కోట్లు సంపాదించవచ్చు. కానీ.... అది సరియైన మార్గము కాదు. ఎవరినీ మోసము చేయకుండా, నిజాయితీగా, కష్టించి సంపాదించినదే నిజమైన సంపాదన! అదే మానవుడిని మహనీయుని చేస్తుంది.

ఈ రోజున మనిషికి డబ్బు లేకపోతే.... విలువలేదు. "నేను మహా పండితుడను" అంటే ఎవరూ లెక్కచేయరు. నీ దగ్గఱ లక్షలుంటే....వందలాది ప్రజలు నీ చుట్టూ చేరుతారు. నీకు భజనలు చేస్తారు. పదవులను అంటకడతారు. నీ చేత డబ్బు ఖర్చుపెట్టిస్తారు. ఇదీ ఈనాటి లోకము తీరు. డబ్బు సంపాదించుట సినిమాలలో చూపించినంత తేలిక కాదు. "ధన మూల మిదం జగత్" మరియు మాతాపుత్ర విరోధాయ హిరణ్యాయ నమో నమః" అని అన్నారు పెద్దలు. అంటే ప్రపంచమునకు మూలము డబ్బు!

తల్లీ కొడుకులకు తంపులు పెట్టేది డబ్బు! ఇద్దరు మంచి స్నేహితులను విడదీసేది డబ్బు ! రాజకీయ నాయకులను అందలము నెక్కించేదీ- డబ్బే ! ఈ డబ్బు మనకు లంకెల బిందెల ద్వారా లభ్యము కాగలదనుకొనుట లేదా లాటరీ తగిలి లక్షాధికారి కాగలవనుకొనుట వట్టి భ్రమ మాత్రమే !

సంపద కలసివచ్చుట : స్వయంకృషితో, ఆత్మవిశ్వాసముతో, తెలివి-తేటలతో ఎల్లప్పుడూ ముందుకు సాగిపోవాలి. ఇవి డబ్బు సంపాదించుటకు మొదటి సోపానము ! "కొందరు చూస్తూ–చూస్తూ వుండగానే.... లక్షాధికారులైపోతారు. నిన్నటి వరకు సైకిల్ మీద తిరిగినవాడు- ఈనాడు మారుతీకార్ లో తిరుగుతున్నారు" అని అడుగుతారేమో ? ఇది చాల కొద్దిమంది విషయములోనే జరుగుతుంది. వీరికి కృషికంటే.... అదృష్టము కలసి వచ్చినదన్నమాట ! "కలసివచ్చే రోజు వస్తే నడచివచ్చే కొడుకు పుడతాడు" సామెత! ఇదీ అందరికీ వర్తించదు.

ఆకస్మిక ధన రాబడి : మనము ముఖ్యముగా తెలిసికోవలసినదేమిటంటే.... నిన్నటిదాకా సామాన్యుడు- ఈనాడు మాన్యుడెలా కాగలిగాడన్నది. వారి కృషి, వారి జీవితలక్ష్యము, వారి తపన, పట్టుదల, ఏకాగ్రత మున్నగు పద్ధతులను తెలిసికోవాలి.

ఒక శాస్త్రవేత్త- తన కృషితో, తపనతో, పట్టుదలతో ఒక నూతన విషయమును కనిపెడతాడు. ఆ నూతన ప్రక్రియతో అతడు ప్రపంచ విఖ్యాత పురుషుడౌతాడు. లక్షాధికారి అయిపోతాడు. అదే విధముగా ఒక బీదవాడు వారసత్వపు దావాను కోర్టులో పాపర్ గా దాఖలుచేస్తాడు కోర్టులో- కేస్ను నెగ్గుతాడు. లక్షలాది ఆస్తికి వారసుడౌతాడు. అప్పటికి అతని కృషి, శ్రమ, తపన, పట్టుదల ఫలించిందన్నమాట ! అతనికి "నేను నెగ్గుతాను" అనే ఆశ, పాజిటివ్ థింకింగ్ లేనిదే అతడు విజయము సాధించలేడు. "నేను నెగ్గలేను". అశక్తుడిని" అని అనుకుంటే....అతడా పని చేయగలడా? చేయలేడు. మనకి 'కుందేలు–తాబేలు' కథ తెలుసు ! చేయాలని అనుకుంటే అదిచేసి తీరుతాం. ఆ దీక్ష లేకపోతే ఎక్కడ వున్న

వారము అక్కడే వుండిపోతాము "గొత్తితోక బత్తెడే! అందాకా ఎందుకు? మా ఊరిలో ఒకాయన ఆయనకు ఇష్టము లేకపోయినా.... పదిమంది బలవంతము మీద ఆఖరి లాటరీ టిక్కెట్‌ను- ఒక్క రూపాయితో అతి కష్టముమీద కొన్నాడు. అతనికి ఆ లాటరీ టిక్కెట్ మీద లక్షరూపాయల బహుమతి వచ్చింది రాత్రికి రాత్రి ఆయన లక్షాధికారి అయ్యాడు. ఏమి చెప్పగలము? ఆయన స్నేహితులెందరో నెలల తరబడి డబ్బు కడుతూనే వున్నారు. ఒక్కరికీ అదృష్టము తగులలేదు. 'ఆశ' మనిషిని జీవింపజేస్తుంది "ఏదో వస్తుందనుకుం"టేనే మనిషి ఏ పనైనా చేస్తాడు. "రాద"నుకుంటే.... మనిషి ఆ పని చేస్తాడా? ఆ ఆశ ప్రజలలో వుండ బట్టే.... లాటరీవారు అన్ని లక్షల టిక్కెట్స్‌ను అమ్మగలుగుతున్నారు.

ఆర్జన విషయములందు ఆలస్యము కూడదు :

"రేపు" అన్నదాని మీద అందరికీ 'ఆశ' వున్నది. "రేపు మనకి మంచి జరుగుతున్నదన్న భావన వున్నప్పుడే.... ఈ రోజు మనము జీవించ గలుగుతున్నాము. రేపు మీద మీకున్న ఆశతోపాటు "మీరేమిటో" అన్న విషయమును కూడా మీరు తెలిసికోవాలి. ఏదైనా ఒక పనిని ప్రారంభిద్దా మనుకున్నప్పుడు అది మంచి పని అయితే వెంటనే మొదలుపెట్టాలి. మంచి పని చేయాలనుకున్నప్పుడు ఆ సంకల్పము కలిగిన క్షణమే మనకు మంచి ముహూర్తము" అనుకోవాలి ఏమాత్రము జాప్యము చేయకూడదు. "ఆలశ్యం అమృతం విషం" అనికూడా పెద్దలన్నారు.

ధనార్జనయందు ప్రయత్నలోప ముండరాదు :

నీవు చేసేపని పెద్దదైతే.... బాగా ఆలోచించుకుని, టైమ్ తీసికొని, నలుగురు మిత్రులనూ సంప్రదించి చేయాలి. అందరూ "వద్దం"టే ఆ ప్రయత్నమును మానివేయాలి. మొండి పట్టుదలతో చేయకూడదు. ఆవేశము అనర్థములకు దారితీస్తుంది. ఆలోచన మంచి ఫలితమును ఇస్తుంది! "కష్టపడితే.... ఫలితము దక్కుతుంది" అన్న సామెత ఆనాడే కాదు ఈనాడు కూడా ముమ్మాటికి నిజమౌతున్నది.

ఏ పని చేయకుండా వుండుటకంటే.... ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తూనే వుండుట మంచిది. అదే మనకు ఆరోగ్యదాయకము! "మనకు పెట్టుబడికి డబ్బులేదు, ఏమి చేయగలము" అనుకుంటూ కూర్చుంటే.... మనమేమి చేయలేము. ఏదో ఒకటి చేయటమే ప్రయత్నమంటూ చేస్తే మనము తప్పక సాధించగలుగుతాము ! ఏదో గాలివాటుగా కాకుండా.... తీక్షణముగా ప్రయత్నించాలి" అని అనుకోవాలే గానీ.... "అయినా ఫరవా లేదు, కాకపోయిన ఫరవాలేదు" అని అనుకోకూడదు.

## వ్యాపార ప్రారంభము - పరిశీలన

మీరేదైనా వ్యాపారమును ప్రారంభించేటప్పుడు ముందుగా మీకు ఆ వ్యాపారమును గురించిన సంపూర్ణ విజ్ఞానము వుండాలి. దానిని గురించి కూలంకషముగా తెలిసికోవాలి. దాని తాలూకు ప్రాథమిక సూత్రములను మీరు బాగా ఆకళింపు చేసికోవాలి. దానివలన మనకు కలిగే సత్ఫలితము లను, దుష్ఫలితములను అవగాహన చేసికొని; అంచనా వేసికోవాలి. అది మనకి "లాభసాటిగా వున్నదా? లేదా??" అనే విషయము ముందుగా తెలిసి కోవాలి. సగము దిగిన తరువాత పశ్చాత్తాపము చెందకూడదు వెనుకంజ వేయకూడదు. ప్రారంభించకూడదు ... ప్రారంభిస్తే.... దాని అంతు చూడనిదే వదలకూడదు.

మీరు వ్యాపారము చేయాలనుకున్నప్పుడు మార్కెట్‌ను స్టడీ చేయాలి. అక్కడి వాతావరణమును తెలిసికోవాలి. "మార్కెట్‌కు ఈనాడు ఏ వస్తువు కావాలి? దానిని మనము సమకూర్చుట ఎలాగ??" అన్న ఆలో చన ముందుగా మనకు కలగాలి. "మార్కెట్‌లో ఏ గాలి వీస్తున్నది" అన్నది స్టడీ చేయాలి. ముందుగా మీరు ఆ విధమైన ఆలోచనా ధోరణిని కలిగి వుండాలి. ఆ ధోరణి సర్వ సామాన్యముగా అందరికీ అబ్బదు. అది వ్యాపార శైలి తెలిసిన వారికే బోధపడుతుంది. మీరు మీ దైనందిన 'టైమ్ టేబుల్'ను ముందుగా తయారు చేసికోవాలి. ఏ రోజున మీరేమి చేసేది అందులో ముందుగా వ్రాసికోవాలి. దాని ప్రకారమే మీరు ముందుకు

సాగాలి. ఇక్కడే మీరు తెలివి-తేటలతో జాగ్రత్త, మెలకువ శ్రద్ధలను చూపాలి. ఇది మీరు 'ఒడియము'ల వ్యాపారమును చేయాలనుకున్నా, 'ఒనిడా T.V.'ల వ్యాపారమును చేయాలనుకున్నా కూడా అవసరము!

ఒడియముల వ్యాపారము, పచ్చళ్ళ వ్యాపారము పెట్టి; పారిన్‌కి ఎగుమతి చేసిన వారున్నారు. నాకు తెలిసిన ఒక మిత్రుడు 'తాంత్ర బిజినెస్' స్టార్ట్‌చేసి, 'న్యూజెర్సి'కి ఎగుమతి చేసి, మిలియనీర్ అయ్యాడు. కనుక.... మార్కెట్‌లో మనందరికీ కావలసిన వస్తువేమిటో తెలిసికొని దానిని సప్లై చేయుటకు ప్రయత్నిస్తే.... మనము మన వ్యాపారములో నెగ్గుకొస్తాము.

నాకు తెలిసిన మరొక మహిళ అప్పడముల వ్యాపారమునకు-రు. 15/-లను మాత్రమే పెట్టుబడిపెట్టి, ఈరోజు- 12 మంది మహిళలకు ఉపాధి కలిపిస్తూ.... తాను తన పెద్ద సంసారమును పోషిస్తూ.... సూపర్ మార్కెట్స్‌కు, పెద్ద పెద్ద హోల్‌సేల్ మార్కెట్స్‌కు ఆమె ఈరోజు పెద్ద ఎత్తున అప్పడములను సప్లై చేస్తూ వున్నది. ఆమె చదివినదెంతో తెలుసా? ఐదవ తరగతి! ఇంగ్లీష్ రాదు. కనుక.... వ్యాపారమునకే కాదు.... దేనికైనా సరే కావలసినది శ్రద్ధ, ఓపిక, పట్టుదల, చిత్తశుద్ధి. తనుచేసే పనిమీద మనకి గౌరవము వంటివి వుండాలి.

ప్రతివారికీ "న్యాయముగా, నిజాయతీగా కష్టపడుతున్నాము ! విజయము ఎందుకు సాధించలేము?" అన్న తపన వుండాలి. ఆ తపనే వారి విజయమునకు గట్టి పునాది అవుతుంది.

నేడు గొప్పవారుగా ఉన్న చాలమంది ఒకప్పుడు ఏమీ లేనివారే! ఎన్నో అపజయములను- జీవితములో ఎదుర్కొన్నవారే! కృషితో, పట్టుదలతో, కార్యదీక్షతో తాను అనుకొన్న దానిని సాధించగలిగారూ, చరిత్రను సృష్టించగలిగారూ అంటే.... అదంతా వారి దీక్ష, పట్టుదల, సహనము వంటివే కారణము!

# ధనార్జనచేసిన మోసగాళ్ళు

ధనార్జనచేసి, పైకొచ్చిన వా రెవరో తెలుసుకుందాము! వారి అడుగు జాడలలో పయనిద్దాము. ఏమి సంపాదించినా, ఎలా సంపాదించినా.... ముందుగా మనము జీవన విహంగ యానము చేయుటకు కావలసినది "ధనము" అనే 'ఇంధనము'. అది లేనిదే మానవ విమానము పైకెగరదు.

"డబ్బు సంపాదించుట చాల సులువు!" అని ఒకాయన "డబ్బు సంపాదించే చిట్కాను తెలిసికోండి!" "లక్షల సొమ్మును రోజులలో ఆర్జించుట ఎలా?" "మీకీ చిట్కా కేవలము Rs. 50/-లు మాత్రమే" అని పేపర్ లో ప్రకటనను వేయించాడు. కొన్ని లక్షలమంది Rs- 50/-ల చొప్పున పంపారు. చివరికి అతను చెప్పిన 'చిట్కా' ఏమిటో తెలుసా? అదే 'రహస్యము!' "ఈ విధముగా ప్రకటన యివ్వడమే!" అన్నాడట.

మొన్న ఈమధ్యనే ఒక మలయాళ దేశస్థుడు విజయవాడలో వేలాది మందిని మోసగించి, లక్షలాది సొమ్మును దోచుకుపోయాడు. 'సప్తగిరి' మోసమునకు విద్యావంతులు సహితము అతడి వలలో పడ్డారు. "వంద రూపాయల వస్తువును- కేవలము పదిరూపాయలకే ఇస్తాన"ని చెప్పాడు ఈ విధముగా అంటే.... "అతి ఖరీదైన వస్తువులను అతి స్వల్ప ధరలుక ఇస్తామ"ని ఒక స్కీమ్‌ను ఏర్పాటుచేసి, చివరికి ఏ కొద్దిమందికో మాత్రమ ఇచ్చి వేలాదిమంది దగ్గఱ వసూళ్ళుచేసి, పరారై పోయాడు. ఆ 'షాక్ నుండి చాలమంది ఇంతవఱకూ రికవర్ కాలేదు. "తప్పెవరిది?" "మో గించిన వాడిదా? అతి ఆశతో డబ్బు పోగొట్టుకొన్న వాడిదా?" "వం రూపాయల వస్తువు- పది రూపాయలకు ఎలా ఇస్తానన్నాడ"న్న ఆలోచ "ఎవరికైనా వున్నదా!" "చవకగా కొట్టేద్దామ"నే చీప్ మెంటాలిటీ తప్ప కనుక అతి ఆశ ఎప్పుడూ చెడ్డది.

"కూటికోసము కోటివిద్యలు" అతను తన స్వార్థముకొరకు యిత లను ఆశపెట్టి, మోసగించాడు. అదొక రకమైన సంపాదన. "సెల్వరాజ్

అను నతడు 'సప్తగిరి' పెట్టి, లక్షలు ఒక్క నెల తిరుగకుండా సంపాదించాడు. అతనిమీది కేస్ ఏమైనదో కూడా ఇప్పటివఅకూ ఎవరికీ తెలియదు. అతడిని గుఱించి ప్రజలు పూర్తిగా మఱచిపోయారు.

'ధనార్జన' అత్యాశ కారాదు: ఈమధ్యనే మరో ఫైనాన్సింగ్ కంపెనీ చేతులు ఎత్తివేసినది. షేర్‌హోల్డర్స్ నష్టపోయారు. చిట్ ఫండ్ కంపెనీల మాట చెప్పనక్కరలేదు. సుదర్శన్ చిట్‌ఫండ్ వంటిదే దెబ్బతిన్నది. వాటి చరిత్రలను బట్టి చూస్తే.... కొన్ని కంపెనీలు మోసాలకు జనాన్ని గుఱిచేసాయి. కొన్ని అవే మోసపోయాయి. కాబట్టి.... అత్యాశ మనిషికి పనికిరాదు.

ఒక అనుభవజ్ఞుడన్నమాట గుర్తుకొస్తూ వున్నది. "కాస్తంత తెలివి రవ్వంత చాకచక్యము, కొద్దిగా తెగువ వుంటే చాలు.... డబ్బు సంపాదించవచ్చు. లక్షాధికారుల జాబితాలో చేరిపోవచ్చు" అన్నాడు. ఇంతలో మరొకాయన కల్పించుకొని- "దానికి చిటికెడు అదృష్టము కూడా కలిసి వస్తే.... మరీ మంచిది" అన్నాడు.

## ధనార్జనలో- ప్రముఖులు

మన దేశములో "అధిక ధనవంతులు" అనగానే మనకి వెంటనే గుర్తుకువచ్చేవారు ముందుగా 'టాటా, బిర్లాలు.' వారి తరువాతే మరి ఇతరులను చెప్పుకుంటాము! అదే ప్రపంచ స్థాయిలో అయితే- 'ఫోర్డ్ ఫౌండేషన్' అధినేత "ఫోర్డ్" గుర్తుకు వస్తారు. మనకి సినీనటులలో కూడా కోటీశ్వరులు లేకపోలేదు. కాని వారిని టాటా, బిర్లాల తరువాత జాబితాలో చేరుస్తాము. 'టాటా, బిర్లాలు' ఇండస్ట్రియలిస్టులు ! వారి తరువాతే ఎవరైనా! వ్యాపార రంగములో వారిని మించినవారు లేరు. వీరు ఏది చేపట్టినా....దాని వెనుక వారి అకుంఠిత దీక్ష ! అవిశ్రాంత శ్రమ ఇమిడి వున్నాయి. సునిశితమైన ఆలోచన, సకాలములో సరైన నిర్ణయమును తీసుకోగల సామర్థ్యమువంటివి వారిలో కలవు. సమయస్ఫూర్తి, క్రొత్త

క్రొత్త పథకములను రూపొందించగల మేధస్సు వారిని ఆ అంతస్తులకు తీసుకు వెళ్ళగలిగినది. అందుకే....వారీనాడు పారిశ్రామిక రంగములో అద్వితీయులై వెలుగొందుతున్నారు. ఇప్పటికీ వారు అహర్నిశలు పని చేస్తారు. ప్రగతి పథమునకు పతకాలు వేస్తారు. 'భారత రత్న' బిరుదు నందుకున్న J R. 'టాటా' పారిశ్రామిక రంగమునకే గర్వకారణము! ఇవన్నీ కట్టుకథలు కావు! పచ్చి నిజములు!! అయినా....అందరూ టాటాలు, బిర్లాలు కాగలరా?

ఎవరి పరిధిని బట్టి, ఎవరి తెలివి-తేటలను బట్టి .. వారు జీవితములో ఏదో విధముగా రాణించుటకు కృషి చేయాలి. ఆ కృషే వారిని అందలము ఎక్కిస్తుంది. వారికొక ఉత్తమ స్థానమును, గుర్తింపును కలిగిస్తుంది. అందరూ పల్లకీని ఎక్కలేరు కదా....! కొందరు ఎక్కితే.... వారికి నాలుగురెట్లు పల్లకీని మోసే వారుంటారు.

డబ్బు సంపాదించదలచుకుంటే....కిళ్ళీకొట్టు పెట్టుకున్నా, లేదా టీ స్టాల్ పెట్టుకున్నా కూడా సరిపోతుంది. కాని మనిషికి ధ్యేయము అంతటితో ఆగిపోకూడదు.

## దారిద్ర్య చావులు - దరిద్ర బ్రతుకులు

పేపర్ తిరగేయగానే....మనకు మరో రకపు వార్తలు దర్శనమిస్తా వుంటాయి. అవి "ఫలాని గ్రామములో పంటలు పండక....రైతులు ఆత్మ హత్య చేసుకున్నారు. "చేనేత కార్మికులకు (చేతి మగ్గములమీద పనిచేసే కార్మికులు) పనిలేక జీవితము గడుపలేక, ఆకలి భరించలేక కుటుంబాలు కుటుంబాలే విషము మ్రింగి ఆత్మత్యాగము చేసుకున్నాయి." వంటి వార్తలు మనస్సులను కలచివేస్తాయి. మనదేశ దుర్గతి యిది! పనిచేద్దామనుకున్న వారికి పనివుండదు. పనికిమాలిన వారికి చేతినిండా పనే ఏ రాజకీయ నాయకుని అండలోనో- బ్రతుకును సాగిస్తూ....వారు చెప్పిన దుండగములను చేస్తూ...అతి దుఃకష్టకరమైన, అవినీతి భూయిష్టమైన జీవితము

లను గడుపుతూ వుంటారు. మరికొందరు దొంగతనములకు, దోపిడీలకు, హత్యలకు- కిరాతకులవలె నిత్యము మృత్యు గృహములో జీవిస్తూ వుంటారు. వారి బ్రతుకులు- అతి నీచముగా, నికృష్టముగా వుంటాయి. దినదిన గండముగా వుంటుంది. "ఎప్పుడు ఏ క్షణములో ఏమి జరుగుతుందో"ననే భయము, "ఎక్కడ పోలీస్‌లకు దొరికిపోతామో"నన్న జంకుతో బ్రతుకుతూ వుంటారు. ఈ విధముగా మన సంఘములో భిన్న భిన్న పరిస్థితులతో సతమతమౌతూ వుంటారు.

ఇవికాక వరదలవలన దెబ్బతిన్నవారు మరికొందరు! త్రాగుటకు నీరు లేకుండా కొన్ని ప్రాంతములలోని ప్రజలు అలమటించిపోతూ వుంటారు.

## ధనార్జనకు - విపరీత మార్గములు

తేలికగా.... డబ్బు సంపాదించి, సునాయాసముగా లక్షాధికారులగుటకు కొందరు ఆశిస్తూ వుంటారు. అందుకే వారి దృష్టి ఎంతసేపూ లాటరీ టిక్కెట్స్ మీద వుంటుంది. "కష్టపడి పనిచేద్దాము! డబ్బు సంపాదిద్దామ"ని వుండదు. మరోరకము మనుషులుంటారు.... ఇక వారు "పేకాటలో మిలియనీర్ అయిపోదామ"ని ఆశిస్తారు. "అదెలా సాధ్యమ"ని కూడా ఆలోచించరు. మూడో రకము వ్యక్తులున్నారు.... వారి మనస్సెప్పుడూ- గుఱ్ఱపు పందెముల మీదికే పోతూ వుంటుంది. "గుఱ్ఱపు పందెములలో లక్షాధికారులవ్వాల"ని వారి తాపత్రయము! ఇక నాలుగవ రకమువారు "షేర్స్‌లో పెట్టుబడిపెట్టి కోటీశ్వరులౌదామ"ని వారి తపన! ఈ వ్యసనముల వలన- వారికున్న కాస్త ఆస్తి, కొద్ది సంపాదన హారతి కర్పూరములా కరగిపోతుంది. అవి ఫలించక....నిస్పృహ! అది తట్టుకోలేక....త్రాగుడు, దాని తరువాత మగువల వేట! ఇదీ ఈనాటి నవయువకుల కార్యక్రమావళి! వచ్చేది మాత్రము వేలలో ఒకడికి! పోయేది మాత్రము మిగతా అందరికీ!! అయినా సరే.... ప్రతి వ్యక్తి తనకు "వస్తుంద"నే కడుతుం

పోదు. "రాదు" అని నిరాశ చెందడు. మళ్ళీ మళ్ళీ కడతాడు. పోతుంది.... మళ్ళీ కడతాడు. ఇలా వచ్చేవరకు కడుతూనే వుంటాడు. గానీ....రాదు. ఆస్తి పోతుంది. గేంబ్లింగ్‌లో పోయేవాడికున్న పట్టుదల- గెలిచేవాడికుండదు. గెలిచినవాడు ఇక అక్కడ వుండడు. "మళ్ళీ కడితే....పోతుందేమోన"ని భయము! పోయినవాడు అలాకాదు...."పోయినదంతా రికవర్ చేయలేకపోతానా?" అని కడుతూనే వుంటాడు. ఇదే గేంబ్లర్స్ సైకాలజీ!

నాలుగురోడ్ల జంక్షన్‌లో- లాటరీ టికెట్స్ అమ్మేవారి సంఖ్య నానాటికీ పెరిగిపోతూవున్నది. అన్ని పబ్లిక్ ప్లేసెస్‌లోనూ వీరే ప్రత్యక్ష మౌతూ వుంటారు. రైల్వేస్టేషన్స్‌లో, బస్‌స్టేషన్స్‌లో, కాఫీహోటల్స్‌వద్ద, కోర్టులవద్ద, సినిమాహాల్స్‌వద్ద.... ఒకటేమిటి.... నలుగురుండే ప్రతీచోట లాటరీ టిక్కెట్స్ వారు ప్రత్యక్షమౌతూ వుంటారు. వారిని తప్పించుకొనుట మన తరముకాదు. మన దేశములో దాదాపు అనేక రాష్ట్ర ప్రభుత్వములు ఈ లాటరీలను ఎంకరేజ్ చేస్తున్నారు. దీనివలన ఆయా రాష్ట్రములకు అమితమైన ఆర్థిక లాభము వున్నది. టిక్కెట్స్ కొన్నవారికన్నా.... టిక్కెట్స్ అమ్మినవారు ఇళ్ళు కట్టుకున్నవారు ఉన్నారు. అమ్మినవారికి వారి టిక్కెట్స్‌ల అమ్మకము మీద వచ్చే కమీషన్ ప్లస్ వారి అమ్మిన టిక్కెట్స్ కొన్నవారికి ఎవరికైనా ప్రైజ్ వస్తే.... ఆ టిక్కెట్స్ అమ్మిన వారికి మరో బహుమతి కూడా వుంటుంది. కనుక టికెట్ కొన్నవారి కన్నా.... ఆ టికెట్ అమ్మినవారికి ఎక్కువ లాభము కలిగే అవకాశము వున్నది

## కూటి కోసమే.... కోటి విద్యలు!

మనము కేవలము కూటికోసమే పనిచేయకూడదనిపిస్తుంది. ఎందుకంటే....మనము బ్రతుకుటకు తినాలి కానీ.... తినుటకు మాత్రమే బ్రతుక కూడదు.

మనము సామాన్యముగా చూస్తూ వుంటాము! కొంతమంది ప్రతీ కొట్టుకూ తిరిగి, ఆ కొట్లో ధూపము వేస్తూ వుంటారు. వారి వుద్దేశ్యము- "ఆ కొట్టులోని చెడు ధూళి, చెడుగాలి పోవాల"ని; "దృష్టి తగులకూడద"ని "ఆ కొట్టు యజమాని కలకాలము బాగుండాల"ని కోరు కొనుటయే! ఆ కొట్టు యజమానికి "సాంబ్రాణిధూపము వేయుటవలన కొట్టుకు ఏ రకమైన దోషము సోకద"ని విశ్వాసము ఉంటుంది. ధూపము వేసినందుకు గాను- కొట్టు యజమాని డబ్బు ఇస్తాడు. మానవుడిని దైవములా జీవింపచేసేదే నమ్మకము! నమ్మినవాడు తప్పక బాగుపడ తాడు- నమ్మనివాడు కష్టముల పాలౌతాడు.

గుడిమెట్ల దగ్గఱ కూర్చుని, చెప్పులకు కాపలా కాస్తూ.... జతకు పదిపైసలనుండి, ఏబది పైసల చొప్పున వసూలుచేస్తూ వుంటారు. వారికి కూడా రోజుకు Rs 50/- వఱకు ముడుతుందని అంటారు. పెద్దగా శ్రమపడకుండా.... ఒక్కదగ్గఱే కూర్చుని, సాయంత్రానికి- వదో ఇరవయ్యో సంపాదిస్తారు. వారికి భుక్తి గడిచిపోతుంది. వీరు నలుగురూ వచ్చే పాపులర్ గుడివద్దనే కూర్చుంటారు. చిన్న చిన్న గుడులవద్ద కూర్చోరు. అక్కడ వారికి సంపాదన వుండదు. ఇవన్నీ సామాన్యులు చేసే పనులు! మనము మరోరకము వారిని చూద్దాము! వీరు సామాన్య స్థాయినుండి అసాధారణ స్థాయికి చేరిన ప్రముఖులు!

## అసాధారణులైన - సామాన్యులు

మీరు T.V. ఆన్ చేయగానే.... మీకు కనిపించేది "వాషింగ్ పౌడర్ నిర్మా" అంటూ పాటపాడే అమ్మాయి! ఈ సబ్బు- పౌడర్‌లకు రూపశిల్పి నిర్మా అధినేత 'కార్సన్‌భాయ్!' ఈయన గుజరాత్‌లోని ఒక పేదరైతు కొడుకు!! నెలకు నాలుగు వందల రూపాయల జీతముతో కెమిస్ట్‌గా చేరిన వ్యక్తి! ఈ రోజున 250 కోట్ల రూపాయలతో అహ్మదా బాద్‌లో ఒక సోడా అష్ ప్రాజెక్ట్‌ను నిర్మిస్తూ.... టాటా కెమికల్స్‌కు

పోటీగా నిలిచాడు. అతను చేసిన ఘనకార్యము ఏమిటి ? మామూలు చాకలిసోడాకు రంగులేసి, కొద్దిపాటి రసాయనిక చర్యలతో- మార్పుతెచ్చి, నిర్మా పౌడర్‌ను తయారుచేసాడు. ముందుగా తన ప్రోడక్ట్‌ను- తన బంధువులకు, స్నేహితులకు అమ్మాడు అదీ సెలవురోజులలో ! మెల్ల మెల్లగా అమ్మకములు పెరిగాయి. అప్పుడు కమీషన్‌మీద ఇంటింటికీ తిరిగి అమ్మేందుకు మనుష్యులను పెట్టుకున్నాడు. దానికి "నిర్మా" అని తన కూతురు పేరును పెట్టుకున్నాడు. ఆ విధముగా ఏర్పాటు చేసికొనుట వలన.... అతనికి అయిదువందల కిలోల నిర్మా పౌడర్ అమ్మకము జరిగినది. మొదట రేడియోలో అడ్వర్‌టైజ్‌మెంట్స్ వచ్చాయి. తరువాత T.V. అడ్వర్‌టైజ్‌మెంట్ ప్రారంభించాడు. 1987వ సంవత్సరమునకే అతని ఆదాయము 350 కోట్లు రూపాయలను మించిపోయినది. అమ్మకాలలో కార్సన్‌భాయ్‌పటేల్ కేవలము పదేళ్ళలో అయిదుకోట్లు సంపాదించాడంటే.... దాని వెనుక అతని పరిశ్రమ ఎంత వున్నదో.... మనకు అర్థమౌతూ వున్నది.

250 కోట్ల సోడా అష్ ప్లాంట్‌తో పాటు డిటెర్జెంట్‌లకు ముడి పదార్థమైన 'లీనియర్ అల్కాలైడ్ బెంజీన్' పరిశ్రమను కూడా ప్రారంభిస్తూ వున్నాడు. చాకలిసోడాను- వాషింగ్ పౌడర్‌గా మార్కెట్ చేయుట ఒక మంచి అయిడియా ! "చౌక వస్తువెప్పుడూ అత్యధికముగా అమ్ముడౌతుంద"ని కార్సన్‌భాయ్ అభిప్రాయము ! అందుకే.... అతడు విజయవంతమయ్యాడు.

ప్రజలకు ఎప్పుడేది కావాలో.... అది కనిపెట్టి, దానిని అందుబాటులోనికి తెచ్చుట ఒక వ్యాపారసూత్రము ! దీనిని అమలుపరచాడు మన కార్సన్‌భాయ్ ! ఇతగాడు 'హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ కంపెనీ' లకు తన వ్యాపారముతో ముచ్చెమటలు పట్టించాడు ఇది ఓ సామాన్య మానవుడి మేధలో ఉద్భవించిన ఒక చిన్న ఐడియా యొక్క ప్రభావము !

అలాగే మన ఆంధ్రదేశములో- ప్రముఖ వ్యాపారవేత్తలైన - సామాన్యులను గురించి తెలిసికొందాము. T.V. ద్వారా వీరి ప్రోడక్ట్స్ అందరికీ పరిచితములు ! ఏలూరులోని అంబికా దర్బారుబత్తి: మచిలీ పట్టణములోని త్రివేణి వక్కపొడి, జెమిని వక్కపొడి; గుంటూరు సంపత్ క్రేన్ వక్కపొడి ఇవన్నీ మనము రోజూ T.V.లో చూస్తూనే వున్నాము. ఒక్కసారి వీటిని స్థాపించినవారి జీవితములను గురించి తెలిసికోండి! ఎవరు ఎన్నెన్ని కష్టములు పడ్డారో మీకు తెలుస్తుంది.

ఇటీవలి కాలములో ప్రజలను విశేషముగా ఆకర్షిస్తున్నది 'షేర్ మార్కెట్ !' ఆ విషయము అందరికీ తెలిసినదే ! "షేర్లు" అనగానే.... మనకు ముందుగా 'హర్షద్ మెహ్తా' గుర్తొస్తాడు. తరువాత గుర్తుకు వచ్చే వ్యక్తి నిమిష్‌షా! వీరిద్దరూ షేర్ మార్కెట్‌కే పెద్ద హీరోలు! ఇందులో హర్షద్ మెహతాపైన వచ్చిన అలజడి, దుమారము వలన షేర్ మార్కెట్ పడిపోయిన ప్రస్తుత పరిస్థితి అందరికీ తెలిసినదే కదా!

హర్షద్ మెహతా వయస్సు- 38 సంవత్సరములు మాత్రమే! అతడికి 'న్యూ ఇండియా ఇన్సూరెన్స్ కంపెనీ'లో- నెలకి Rs. 2000/- జీతము తెచ్చుకునే ఓ ఉద్యోగము! నలుగురు అన్నదమ్ముల కుటుంబము మధ్య జీవితము సాగిస్తూ వుండేవాడు. సుమారు నాలుగువందల యార్డ్ గజముల స్థలములో వున్న ఇల్లు నలుగురు అన్నదమ్ములదీ ! అంతా అందులోనే సర్దుకుని సఖ్యతగానే వుంటూన్నా.... "తనకంటూ ఒక భవనము కావాలి" అని మెహతా అనుకునేవాడు- కలలు కనేవాడు. ఆ విధముగా 12 సంవత్సరములు కలలలో జీవించాడు. ఒక రోజున అతడు ఊహించిన విధముగానే.... షేర్ మార్కెట్‌కు 'మకుటము లేని మహరాజు' అయ్యాడు. 1990-91 లో వందకోట్లను ఆదాయముగా సంపాదించాడు ప్రైవేట్ కంపెనీలలో- ఆరు తప్ప.... ఈ ఆదాయమును ఎవరూ అధిగమించలేదు. 50 కోట్ల రూపాయల ఇన్‌కంటాక్స్ కడుతున్నాడు. దేశము మొత్తములో ఇంత ఇన్‌కంటాక్స్ కడుతూ వున్న వ్యక్తి అతనే !

200 కంపెనీలలోని హర్షద్‌మెహతా వాటాల విలువ 500 కోట్లు వుంటుంది. ఐదువేల గజముల స్థలములో తన కలల మేరకు ఇల్లును నిర్మించుకున్నాడు. మనిషికి ఆశ వుండుట సహజమే! దీనిని అదుపులో వుంచుకోలేకపోతే.... మనిషి పతనమునకు దారితీస్తుంది. హర్షద్ ఆస్తుల జప్తు వరకు వచ్చినదంటే.... దాని వెనుక వున్నది- "ఆతని దురాశ" అని స్పష్టమౌతూ వున్నది. "దురాశ దుఃఖమునకు చేటు" అన్న సామెత హర్షద్ మెహతా విషయములో నిజమైనది. ఆయా కంపెనీలలో అత్యధిక శాతము వాటాలను మార్కెట్‌లో దొరికినంత మేరకు సంపాదించి, వాటిలో ప్రాబల్యమును సంపాదించాడు. అందువలననే హర్షద్ మెహతా ఏదైనా కంపెనీ జాతకమును తిరగరాయగలడు. ఒక్కసారి అతని కృపా వీక్షణము పడితే.... ఏ కంపెనీకైనా శుక్రమహర్దశ పట్టినట్లే! అది ఆయన సంపాదించిన విశ్లేషణా శక్తి! అదే ఆయనను 'అగ్రగామి'గా నిలబెట్టినది

'నిమిష్' కూడా హర్షద్‌మెహతా అంతటి ఆసామే! 1982లో టాటా 'టీ' కంపెనీలో 50 షేర్స్‌ను మొట్టమొదటిగా సంపాదించాడు. అప్పుడు దానివలన Rs. 1500/- లాభము వచ్చినది. ఆతని తండ్రి మహా సంతోషపడిపోయి, "ముందుకు సాగమం"టూ వెన్నుతట్టి, ప్రోత్సహించాడు. అంతేకాకుండా.... తన బ్రోకర్ దగ్గర బిజినెస్ కుదిర్చాడు. అప్పుడే హర్షద్‌మెహతా అతనికి పరిచయమయ్యాడు. అయితే.... ఇద్దరూ కలిసి మాత్రము పనిచేయలేదు. 1984 లో బొంబాయి ఎక్స్ఛేంజ్ నందు బ్రోకర్ కార్డ్ సంపాదించడమే.... ఒక విశేషమనుకుంటే "వల్లభ్" అనే ప్రైవేట్ అకౌంటెంట్‌తో పరిచయము మరో విశేషమైనది అతనికి! ఆ రోజున నిమిష్ బ్రోకర్ కార్డ్ విలువ ఒకటే పాయింట్ (ఆరు లక్షలు) అయితే.... ఈరోజు దాని విలువ ఎంతో తెలుసా? ఒక కోటి పాతిక లక్షలు!

దాదాపు రెండువేల కంపెనీల గణాంకములను సేకరించిన వల్లభ్-

'నిమిష్'తో చేతులు కలిపాడు. దానితో అతని కెందులోనూ తిరుగు లేకుండా పోయినది.

ఒక సామాన్య ఉద్యోగి షేర్ మార్కెట్‌లో 'ఇన్‌వెస్టర్'గా ప్రవేశించి, ఇంతటి ఘనత సాధించాడంటే.... వింతగానే అనిపిస్తుంది.

కోట్లకు పడగలెత్తిన మన ఈనాటి సినిమా- 'సూపర్ & మెగా స్టార్స్'కూడా ఒకప్పుడు అతి సామాన్య జీవితమును గడిపినవారే! కష్టాలు పడినవారే! వీధి లాంతర్ల క్రింద చదువుకుని, సర్ 'వేపా రామేశం' మద్రాస్ హైకోర్ట్ జడ్జ్ అయ్యారు. అతి బీదస్థితిలో నున్న 'అబ్రహామ్ లింకన్' అమెరికాకు తొలి అధ్యక్షుడయ్యాడు. అలాగే అతి సామాన్య స్థితిలోనున్న 'రుదాల్ఫ్ హిట్లర్' జర్మనీకి అధినేత అయ్యాడు. సామాన్య రైతుకుటుంబములో పుట్టిన 'N.T.R.' ఘనత తెలియని ఆంధ్రుడు లేడు.

రైల్వే ప్లాట్‌ఫారమ్ మీద పడుకొని; ఒక పూట తిని, మరొకపూట తినక.... నిర్మాతల చుట్టూ తిరిగి, ఏ చిన్న వేషమైనాసరే వేయుటకు సిద్ధపడి ఇచ్చిన వేషము వేస్తూ.... అంచెలంచెలుగా- హీరోగామారి, స్టార్‌గా మారి, సూపర్‌స్టార్ అయి, చివరిగా పార్లమెంట్ మెంబర్‌గా ఎన్నికైనారు. అమితాబ్‌బచ్చన్! ఆ రోజులలో నిర్మాతలను కలుసుకునేందుకే చాల రోజులు పట్టేది. అయినా అతడు నిరాశపడి, వెనుకకు తిరిగిపోలేదు- "చిన్న వేషము" అని ఛీదరించుకోలేదు. నీరసపడిపోలేదు. అతను అనుభవించినవన్నీ కష్టాలే! అయితే ఏమి? అతనికి ఆత్మ విశ్వాసము మెండు! అదే అతణ్ణి ముందుకు సాగేటట్లు చేసినది. అతడు ఏనాడూ నిరాశ చెందలేదు.... బెదరలేదు.... బెంగపడలేదు. కృషి, పట్టుదల అతనిని ఆ స్థాయికి తీసికొని వచ్చాయి.

ఈనాడు అమితాబ్ వుంటున్న ఇంటి విలువ ప్రస్తుత రేట్ల ప్రకారము రెండుకోట్ల ఏభై లక్షలు! అతనికి దక్షిణ ఢిల్లీలో మరో ఇల్లు వున్నది. అదీ ఇంత ఖరీదు చేసేదే! ఒక లేబొరేటరీ, జుహూలో బంగ్లా,

అలహాబాద్‌లో మరికొన్ని స్థిరాస్తులు, మరికొన్ని చిన్న చిన్న వ్యాపార ములూ వున్నాయి.

ఆనాడు రైల్వే ప్లాట్‌ఫారమ్ మీద పడుకున్న వ్యక్తే గదా.... ఇంతటి స్థితి పరుడయ్యాడు. తనకు తానుగా సంపాదించుకున్న ఆస్తి! అతని స్వయంకృషి, మేధాశక్తి, అదృష్టమూ అన్నీ కలిసి వచ్చాయి.

అలాగే మరో అగ్రనటుడు ధర్మేంద్ర! అతనికి మొదటిలో ఒక స్కూల్ మాస్టర్ కొడుకుగా మాత్రమే గుర్తింపు! బొంబాయి వెళ్ళి, చిత్ర పరిశ్రమలో స్థిరపడి, మూడు-నాలుగు తరములు తిన్నా.... తరగని ఆస్తిని సంపాదించాడు. స్టూడియోలు, చిత్ర నిర్మాణ సంస్థలు, రెండున్నర కోట్ల రూపాయల విలువచేసే ఒక సూపర్‌సౌండ్ స్టూడియో, నాలుగుకోట్ల రూపాయల విలువచేసే ఇల్లు, ఎనభై లక్షల రూపాయల విలువచేసే ఎపార్ట్‌మెంట్స్ మూడు, జైపూర్‌లో సినిమా థియేటర్; మద్రాస్, నైని టాల్, బెంగుళూర్‌లలో కోట్ల విలువచేసే స్థిరాస్తులూ ఉన్నాయి. ఇవి కాక.... పన్నెండు ఇంపోర్టెడ్ కార్‌లు, పేన్‌లు, అరవై లక్షల విలువ చేసే.... రెండు మెర్సిడెజ్ కార్స్ అతని ఆస్తి! "బడిపంతులు కొడుకు న"ని అతడు తన ప్రయత్నము, కృషి లేకుండా అలాగే వుండిపోయాడా? లోకములో బడిపంతుళ్ళ కొడుకు లెందరు లేరు. వారంతా ఇంత వారయ్యారా? ఇతనే అంత ప్రత్యేక గుర్తింపు పొందుటకు, కారణ మేమిటి ? అతని అవిరళకృషి, పట్టుదల, శ్రద్ధ, "తనకో ప్రత్యేకతను సంతరించుకోవాల"నే తపన, అదృష్టము !

అలాగే మరో అగ్ర సినీనటుడు 'రాజేంద్రకుమార్' కూడా! అతను కేవలము Rs. 20/-లను మాత్రమే సంపాదించేవాడు. అది అతని నెల జీతము కాదు.... సినిమాకి ఇచ్చే పారితోషికము అన్నమాట! ఈరోజు అతను జూబ్లీస్టార్!

రాజేంద్రకుమార్‌కి- "షేర్స్" అంటే ప్రేమ ! అందుకే ఆ షేర్స్

కొరకు- అతడు సొమ్మును ఎక్కువగా కేటాయించేవాడు. తరువాత ఎక్కువగా ఖర్చుచేసేది గార్మెంట్స్ పరిశ్రమకి!

బ్రెవరీ బిజినెస్, రియల్ ఎస్టేట్స్, ఫ్రీవ్యూ థియేటర్, షాపింగ్ కాంప్లెక్స్లు వున్న ఇతని ఇంటి ఖరీదు రెండు కోట్లు!

రాజకీయములందు కొంత ధనమును నష్టపోయినా.... 'శతృఘ్న సిన్హా' కూడా ఏమీ తీసిపోలేదు. రాజకీయములలోకి దిగినా.... అతని ఆస్తి మాత్రము తరిగిపోలేదు. అతని ఇల్లు 'రామాయణ' విలువ రెండున్నర కోట్లు! జితేంద్ర ఇంటిప్రక్క అరవై లక్షల స్థలము, 40 లక్షల విలువచేసే షాపింగ్ కాంప్లెక్స్ ఇతనికి వున్నాయి.

ఇక మన వండర్ స్టార్ 'రాజకపూర్'ని గురించి వ్రాయాలంటే.... చాల వున్నది. అతడిని గురించి తెలియనివారే లేరు.

'షమ్మీకపూర్' అనేక కష్టాలుపడి, పైకొచ్చిన వ్యక్తి! ఇతనికి బొంబాయిలో చాలా ఎపార్ట్మెంట్స్ వున్నాయి. ఢిల్లీలో థియేటర్స్ ఉన్నాయి. కోటి జయిదులక్షల విలువచేసే అపార్ట్మెంట్స్లో వుంటాడు- షమ్మీకపూర్ !

శశికపూర్కి- గోవా, లండన్లలో ఇళ్ళు ఉన్నాయి.

రిషికపూర్- భార్య 'నీతూసింగ్' ఇంట్లోనే తనూ వుంటాడు. నీతూ సింగ్కి- బాంద్రాలో 'బ్యూటీ పార్లర్' వున్నది. చైనీస్ రెస్టారెంట్ వున్నది.

రిషికపూర్ స్వంత ఇల్లు కట్టాడు దాని ఖరీదు 3 కోట్ల రూపాయలు ! షేర్స్, రియల్ ఎస్టేట్స్ సంపాదించాడు.

దేవానంద్ మొదట ఒక పోస్ట్మాన్! ఈనాడు థియేటర్స్కి యజమాని ! ఆయన ఇంటి ఖరీదు రెండుకోట్ల ఏభై లక్షలు !

ఒకప్పుడు మార్కెట్లో- ద్రాక్ష, ఏపిల్పండ్లను అమ్ముకున్న దిలీప్కుమార్ ఆస్తిని లెక్కవేస్తే.... "బొంబాయి రాజు"గా కీర్తింపబడతాడు. ఫ్యాక్టరీస్, హోటల్స్, థియేటర్స్, దేశములోని పెద్ద పెద్ద

ట్రెవరీ సంస్థలలో షేర్స్ ఉన్నాయి. దిలీప్‌కుమార్ బెంగాలీ ముస్లిమ్! అతని అసలు పేరు "యూసఫ్‌ఖాన్ !"

అలాగే సునీల్‌దత్ కూడా ! మూడంతస్థుల భవనములు, అజంతా స్టూడియో, నాలుగు కోట్ల విలువచేసే ఇల్లూ ఉండగా.... కొంత ఆస్తిని కోల్పోయాడు.

తన యావదాస్తిని- 'రజనీష్'కి ధారదత్తము చేసిన వినోద్‌ఖన్నా 'సన్యాసి' అయిన తరువాత సంసారి అయ్యాడు. మళ్ళీ నింపాదిగా సంపాదించాడు. ప్రకాష్‌మెహ్రా దగ్గర అప్పు పుచ్చుకొని, క్రొత్త జీవితమును ప్రారంభించాడు. విలాసవంతమైన ఎపార్ట్‌మెంట్స్‌ను నిర్మించాడు. ఈ రోజున వినోద్‌ఖన్నా ఆస్తిపరుడయ్యాడు.

ఢిల్లీ రాజకీయరంగములో- కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసి, పార్లమెంట్ మెంబర్‌గా గెలుపొందిన 'శ్రీరాజేష్‌ఖన్నా' తెర మరుగైన నటుడు ! ఒక్కసారే చుక్కలా మెరిసాడు. ఇతని ఇంటికి "ఆశీర్వాద్" అని పేరు పెట్టుకున్నాడు. రెండున్నర కోట్లు విలువ చేస్తుంది ఇల్లు ! అతనికి బిజినెస్‌లో షేర్స్, హోటల్స్, ఎపార్టుమెంట్స్, విదేశీకార్స్ ఉన్న రాజేష్‌ఖన్నా గొప్ప ధనికుడు !

"షోలే"లో కేవలము ఐదు వేల రూపాయలకు నటించిన 'గబ్బర్ సింగ్' వేషధారి అంజాద్‌ఖాన్- ఈ రోజున కోటీశ్వరుడు !

సినీ నటీమణులు, తారలు సంపాదించిన ఆస్తులు- కోట్లలో వున్నా.... అవి బయటకు మాత్రము రావు. శ్రీదేవి సంపాదన దేశములో ఏ నటీమణికీ లేదు. ఆమె దేశములో నంబర్‌వన్ తార! ఆమె తీసుకునే పారితోషికము ఇంతవరకూ ఏ నటీమణీ తీసుకోలేదు. శ్రీదేవికి జ్యూయలరీ షాప్స్. షాపింగ్ కాంప్లెక్స్‌లు, షేర్స్ వగైరాలన్నీ వున్నాయి. మద్రాస్‌లో నాలుగుకోట్ల విలువచేసే ఇల్లు వున్నది.

వీరంతా పుట్టుకతోనే ధనవంతులు కారు. తమ ప్రతిభద్వారా, కృషిద్వారా, ఏకాగ్రతద్వారా చిత్రసీమలో అత్యున్నత స్థానమును అలంక

రించారు. అందరి అభిమానములను చూరగొన్నారు. వారి నటనకు మన్ననలను అందుకున్నారు.

పరిశ్రమ, నిరంతరకృషి, సాధన ఇవన్నీ వారిని కోటీశ్వరులను చేసాయి. కొందరిని ఇంకా- ఇంకా చేస్తున్నాయి.

అలాగే.... మన తెలుగు తారలను తీసికోండి ! ఈనాడు ప్రముఖ స్థానమును అలంకరించిన వారందరూ ఒకప్పుడు సామాన్యులే ! అనేక కష్టాలు పడి, పైకొచ్చినవారే ! !

దక్షిణభారతదేశములో- అత్యధిక పారితోషికము తీసికొన్న అతి కొద్దిమంది తారలలో- రజనీకాంత్ ఒకరు! అతడు బెంగుళూర్‌లో- R. T. C. బస్ కండెక్టర్‌గా పనిచేస్తూ.... అతదొకసారి సెలవుపెట్టి, మద్రాసు వచ్చి, డైరెక్టర్ 'బాలచందర్'ను కలుసుకున్నాడు. బాలచందర్ తన చిత్రములో చిన్న వేషమును ఇచ్చాడు. దానితో అతనికి అదృష్టము అందుకున్నది. అతడు పరమభక్తుడు ! మంచి వ్యక్తి !! ఎంతోమందికి ధన సహాయము చేసాడు. ఇండస్ట్రీలో అతనికి మంచి పేరున్నది- తన పేదరికమును అతడు విస్మరించలేదు.

మొదట శ్రీ నాగేశ్వరరావుగారుకూడా అతి సామాన్యులే ! తమ స్వయంకృషితో, ప్రతిభతో పైకొచ్చి, క్రమేపీ కీర్తి-ప్రతిష్ఠలను సంపాదించుకున్నారు.

రోమ్ నగరమును ఒక్కరోజునే కట్టలేదు. అంచలంచలుగా కట్టారు. అలాగే ఏ వ్యక్తి ఐనా.... ఒక్కసారిగా ధనవంతుడు కాలేదు. అంచలంచలమీద పెరుగుతూ రావాలి.

ఒకనాడు సబ్‌రిజిస్ట్రార్‌గా పనిచేసిన వ్యక్తి- మహానటుడై, దేశ వ్యాప్తముగా కీర్తి- ప్రతిష్ఠలను ఆర్జించి, రాజకీయ రంగములో ప్రవేశించి, ఒక రాజకీయపార్టీని నెలకొల్పి - తన ప్రత్యేకతను, విశిష్టతను లోకమునకు చాటాడు. నేషనల్ ఫ్రంట్‌కు ఛైర్మన్ అయ్యాడు. ముఖ్యమంత్రి అయ్యాడు. కోట్ల ఆస్తికి యజమాని అయ్యాడు- అతని మాటే.... అను

చరులకు వేదము ! ఇన్ని ఘనతలున్న మహావ్యక్తి, మేరునగధీరుడు- స్వర్గీయ "నందమూరి తారక రామారావు (N.T.R.)" అని వేఱుగ చెప్ప నక్కరలేదు.

చిన్న పల్లెటూరినందు- సామాన్య కుటుంబములో జన్మించి, నాటిక రంగములో ఆడవేషములను వేస్తూ.... మద్రాస్ చేరుకుని: అక్కడ తన కృషితో, ప్రతిభతో ... ఈ రోజుకీ 'టాప్ గ్లామర్ స్టార్'గా నట సామ్రాట్‌గా, దాదాఫాల్కే అవార్డ్ గ్రహీతగా- అనేక ప్రభుత్వ అవార్డ్ లను పొంది; 'పద్మభూషణ్'గా వెలుగొందుతున్న మహానటులు శ్రీ నాగే శ్వరరావుగారు ! ఎన్నో విద్యాలయములకు, కాలేజ్‌లకు దానములు చేసారు. మమత తెలిసిన 'మనీషి'గా ఎదిగారు- "ఆయనతో నటించాల"ని నటీ మణులు తాపత్రయపడుతూ వుంటారు.

ప్రస్తుతము 'మెగాస్టార్'గా వెలుగొందుతున్న చిరంజీవికూడ అతి సామాన్య కుటుంబమునుండి వచ్చినవాడే ! ఇతగాడు భారతదేశములోనే అత్యధిక పారితోషికము తీసికొన్నట్లుగా వినికిడి !!

ఆయవారములు చేసుకుని, సంగీత విద్య నభ్యసించి, అమర గాయకుడైన వ్యక్తి ఘంటసాల ! వారి మధురగానము అజరామరము అనన్య సామాన్యమైనది.

అన్ని రంగములలోను ఇటువంటివారు వున్నారు.

బొంబాయిలో తాళ్ళు, సున్నము మోసి; నౌకరుగా పనిచేసిన ఒక వ్యక్తి సినీ నిర్మాత అయ్యాడు. పత్రికాధిపతి అయ్యాడు. కీర్తి, ధనమూ రెండూ సంపాదించుకున్నాడు.

చిన్న 'టీ' స్టాల్ ప్రారంభించిన వారు- పెద్దపెద్ద హోటల్ ఓనర్స్ అయ్యారు. ఈ రోజున జంటనగరములలోగానీ, మరే పెద్ద పట్టణములో గానీ- మనకు హెచ్చుగా కనిపించేవి హోటల్స్, సినిమా హాల్స్ ! అలాగే చిన్న బుక్ స్టాల్స్‌ను- ప్రారంభించిన వారు- అనతి కాలములోనే పబ్లిషర్స్‌గా మారినవారు ఉన్నారు.

అతి హీనస్థితినుండి- కృషి, పట్టుదల, స్వయంకృషితో పైకి వచ్చిన వారు ఎందరో.... ఈనాడు మనకు కనిపిస్తారు.

తాత, ముత్తాతలు సంపాదించిన ఆస్తులను అనుభవిస్తూ వున్నవారు కూడా వున్నారు. కానీ.... వారి విషయము మనకి ప్రస్తుతము వద్దు ! స్వయంకృషితో, ప్రతిభతో పైకి వచ్చినవారే మనకి ముఖ్యులు !

"దీపము వుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి" అన్నారు పెద్దలు ! అలాగే.... అవకాశములు వచ్చినప్పుడు వాటిని జారవిడువరాదు. కాలము ప్రతీ వ్యక్తికీ "ఒక దశ" అంటూ కల్పిస్తుంది. అది కొన్ని సంవత్సరముల పాటే వుంటుంది. అప్పుడే మనము ఏది సంపాదించినా ! ఆ తరువాత మరి మనకు ఆ దశ రాకపోవచ్చును.

ఇంతవరకు మనము భారతదేశములోని కొందరు నటులను గురించే తెలుసుకున్నాము. పాశ్చాత్య దేశాలలో గూడా ఇటువంటివారు ఉన్నారు. 'జేమ్స్‌బాండ్' పాత్రను ధరించి, మంచి డబ్బు-ఖ్యాతి నార్జించిన 'సీన్ కానరీ' మొదట జూనియర్ ఆర్టిస్ట్‌గా వుండేవాడు. అంతకు పూర్వము అతను భుక్తికోసము లారీడ్రైవర్‌గా పనిచేసాడు. కొంతకాలములో- ఈతను నేర్పే వ్యక్తిగా పనిచేసాడు. ఇది ఎంతో విచిత్రముగా ఉన్నది కదూ ? కాని....ఇది నిజము !

అలాగే 'క్లింట్ ఈస్టువుడ్' నటుడిగా మారక ముందు- ఒక కాలేజీలో నౌకరుగా పనిచేసేవాడు. కొంతకాలమునకు త్రవ్వేపనిని చేసేవాడు. కొంతకాలము గార్డ్‌గా పనిచేసేవాడు. తిండి గడవక.... కలపను నరికే పనిని కూడా చేసాడు. అతని అందము ఒక నిర్మాతను బాగా ఆకర్షించింది. అప్పటితో- అతని దశ మారిపోయినది.

అలాగే.... చిన్నప్పుడు ముగ్గురు తమ్ముళ్ళతో కలిసి, ఒకే మంచము మీద పడుకున్న 'ఛార్లెస్ బ్రాన్‌సన్' తరువాత మున్పైమూడు గదుల ఇంటిని తనకోసము ఏర్పాటు చేసుకున్నాడు. తన పదహారవ ఏట తండ్రితోపాటు గనులలో పనిచేసాడు. తరువాత తనకు ఆ పని నచ్చక....

రైల్వేలో ఉద్యోగము సంపాదించాడు. తరువాత ఓ మిల్‌లోను, ఆ తరువాత సైన్యములో కూడా పనిచేసాడు. చివరికి నటుడైన 'ఛార్లెస్ బ్రాన్‌సన్' కోట్లాది ప్రేక్షకులను ఆకట్టుకున్నాడు.

ఇదే విధముగా అనేకమంది కూటికి లేనివారు- కోటీశ్వరులయ్యారు. "వారు అదృష్టవంతులు ! వారిలా అందరికీ కలసిరావద్దూ" అని మీరు అనవచ్చు! ప్రతీవారి కృషికి ఏదో ఒకనాడు తప్పకుండా గుర్తింపు వస్తుంది. "కృషి" అనేది వ్యక్తిలో వుంటే.... అంతో–ఇంతో ప్రతిభ ఆ వ్యక్తికి వుంటే.... అతనికిగాని, ఆమెకుగాని తప్పకుండా ఒక గుర్తింపు వచ్చేరోజు వచ్చితీరుతుంది. కాని.... గుర్తింపు వచ్చిన తరువాత- ఆ గుర్తింపును పోగొట్టుకోకుండా.... కలకాలము నిలచే విధముగా వ్యక్తి ప్రయత్నించాలి.

## సంపాదనాపరులు - వితరణశీలురు

ఒక స్థాయికి ఎదిగిన ప్రతి వ్యక్తికీ కొంత వితరణ వుండాలి. కొందరు కేవలము పబ్లిసిటీ నిమిత్తము వితరణ చూపుతారు. మరి కొందరు యదార్థ దృష్టితో వితరణ చూపుతారు. కొందరు విపరీతముగా ఖర్చుపెట్టి, పబ్లిసిటీని పొందుతారు. అవి అట్టే కాలము నిలవవు. మరికొందరు లాభ-నష్టాలను బేరీజు వేసుకుంటారు. ఇంకొందరు చేసే దానము అతిస్వల్పమైనా.... దానికి వారు ఇచ్చే పబ్లిసిటీ మాత్రము చాల హెచ్చుగా వుంటుంది. కొందరు పైసాపైసా నిలువచేసి కొడుకులకు, ఆ కొడుకుల కొడుకులకు అప్పజెబుతారు. "చివరికి రాజుల సొమ్ము రాళ్ళ పాల"నే సామెత క్రిందికి వస్తుంది. వీరి సంపాదన కూడా అంతే! "సంపాదించుట" అనేది ఈ రోజులలో ఏ విధముగానైనా జరుగవచ్చు. కానీ.... "దానిని ఖర్చు పెట్టుట" అనేది అందరికీ తెలియదు. కొందరు మాత్రము సంపాదనను సద్వినియోగము చేస్తూవుంటారు. అది ముమ్మాటికీ నిజము!

జీవనము సాగించుటకు మాత్రమే సంపాదించుకోగలిగిన వారి విషయము వదలివేస్తే.... మిగతా వారి విషయమే మనము ఆలోచించాలి. మీ రెంతైనా సంపాదించవచ్చు. అందులో నుండి కొంత దానము చేయుట ఉచితముగా వుంటుంది.

మానవునకు జీవితములో కలసి వచ్చి, అతనికి అదృష్టము వెన్నంటి ఉన్నప్పుడు- వివేకము పెరగాలి. ఖర్చు చేయుట తెలియాలి. వివేకముతో పాటు విజ్ఞత కూడా వుండాలి.

"ధన మొచ్చిన మద మెచ్చును" అన్న నానుడిని గుర్తుంచుకోవాలి. డబ్బుతో పాటే.... కళ్ళు నెత్తిమీదకి వస్తాయి. గర్వము పెరుగుతుంది. మనుష్యులు మనుష్యులుగా కనిపించరు. వారి ధోరణి యావత్తు మారిపోతుంది. అంతకు ముందున్న నమ్రత, విధేయత మటుమాయమౌతాయి. "డబ్బున్నది కదా అని "అందరూ తన కాళ్ళ వద్దకు రావాలని" కోరుకుంటాడు. ఎవరినీ లక్ష్యపెట్టడు. గౌరవించడు. ఇదే మనిషి పతనావస్థకు దారి తీస్తుంది.

"తమ సంపాదన పదిమందికి ఉపయోగపడాలని". కొందరు తాపత్రయపడి ట్రస్ట్‌లను ఏర్పాటు చేస్తూ వుంటారు. అది భావితరముల వారి కెంతో ఉపయుక్తముగా వుంటుంది.

భర్తృహరి చెప్పినట్లు- "విజ్ఞులైన వారు ఏదైనా ఆరంభిస్తే....దానిని ఆసాంతము కొనసాగిస్తారు. విజయము సాధిస్తారు. మధ్యలో వదలి వేయరు." అలాగే.... ఎన్నో కష్ట-నష్టాల కోర్చి ఆనాడు దేశములో పారిశ్రామిక పునాది రాళ్ళను వేసి, ఈనాడు కోటీశ్వరులైన- బిర్లా, టాటాలు మనకు మార్గదర్శకులయ్యారు. వారు పారిశ్రామిక రంగములో- ఆదర్శ పురుషులయ్యారు. వీరు చిరకాలము చరిత్ర పుటలలో ఉండునట్లు శాశ్వత స్థానమును ఏర్పరచుకున్నారు. 'భారతరత్న' అవార్డ్ నందుకున్న 'టాటా' ఆ స్థాయికి ఎదుగుటకు వారు చేసిన కృషి- గణనీయమైనది.

అదే విధముగా- 1957లో బిర్లా కుటుంబమునకు మార్గదర్శకుడైన 'ఘన శ్యామ్‌దాస్ బిర్లా'కు 'పద్మ విభూషణ్' బిరుదు నిచ్చి, ప్రభుత్వము సత్కరించుట ముదావహము !

పరిశ్రమల స్థాపన : ఈనాడు ఏ పరిశ్రమను స్థాపించాలన్నా.... ఏమంత కష్టము కాదు. సునాయాసముగా పనులను జరుపుకోవచ్చు. బ్యాంకులు లోన్సును ఇస్తున్నాయి. ప్రభుత్వము సహాయము చేస్తూవున్నది. లైసెన్సులను మంజూరు చేస్తున్నది. ఏ విషయములోను నిర్బంధములుండవు.

విద్యావంతులను "పరిశ్రమల పట్ల శ్రద్ధ వహించమని" ఉద్ఘాటించుటయే.... ప్రభుత్వ లక్ష్యం గనుక.... వారిని అన్ని విధముల ఆదుకొని తగిన సహాయము చేస్తున్నది.

ఒకప్పుడు పరిశ్రమలను నెలకొల్పాలంటే.... ఎన్నో రకములైన సమస్య లుండేవి. ప్రస్తుతము అటువంటి సమస్యలు లేవు. నిరాఘాటముగా స్థాపనలు సాగిపోతున్నాయి ఎందరో నూతన పరిశ్రమలను నెలకొల్పుతున్నారు. అభివృద్ధి చెందుతున్నారు. తాము బ్రతుకుతూ.... అనేక కుటుంబములను ఆదుకుంటూ.... ఆదర్శప్రాయముగా జీవిస్తున్నారు. ప్రభుత్వము- పరిశ్రమలపట్ల చూపుతున్న గౌరవము, శ్రద్ధ, సహకారాలే ఇందుకు కారణము ! పూర్వము ఇంత సహకారము వుండేది కాదు. ప్రతీ స్వల్ప విషయమునూ ఆ వ్యక్తే చూచుకోవలసి వచ్చేది. ఏవరి సహాయము, సానుభూతి వుండేది కాదు. ఇప్పటి ఈ విధానమునకు ఆద్యులెవరు ? "యుగపురుషు"లనిపించుకున్న 'తాతా', 'బిర్లా'లు ! వారి జీవితములు మనకు ఆదర్శప్రాయము ! ! వారినుండి మనము గ్రహించవలసిన విషయములు ఎన్నో వున్నాయి. వారంతా అర్జనపరులము కాకపోయినా.... వారి అడుగుజాడలలో పయనించుట మంచిది.

# ధనార్జనకు - మార్గదర్శకులు

'ఘనశ్యామ్ దాస్ బిర్లా' తాతగారు శివనారాయణ్ ! వీరి కొడుకైన 'బలదేవ్‌దాస్' బ్రిటిష్ పారిశ్రామికవేత్తలకు ఏజెంట్‌గా పనిచేస్తూ వుండే వారు.

1899 ఏప్రిల్ 5న 'ఘనశ్యామ్‌దాస్' ఆ కుటుంబములో జన్మించాడు. అతనికి చిన్నతనము నుండి "చదువం"టే పెద్ద ఆసక్తిలేదు. తండ్రి, తాతలతోపాటు వ్యాపారము అంటేనే ఆసక్తిని చూపించేవాడు.

ఘనశ్యామ్ దాస్ బిర్లా తన 20వ ఏట ఒక రోజు ఓ బ్రిటిష్ పారిశ్రామిక సంస్థకు పనిమీద వెళ్ళాడు. అప్పటికి అతని వేషధారణ ధోవతి, కుర్తా ఇవి ధరించి; అతడు లోనికి వెళితే.... అతడిని ఎవరూ అక్కడ గౌరవించలేదు, సరికదా.... అతను లిఫ్ట్ ఎక్కితే- అతనితోపాటు లిఫ్ట్‌లో ఎక్కిన బ్రిటిష్ అధికారులు చాలా న్యూనతగా మాట్లాడారు. బిర్లా అదేమి లెక్క చేయలేదు. తను కలవదలచిన వ్యక్తి యొక్క గది గుమ్మము దగ్గరకు వెళ్ళాడు. అయితే.... అతనిని కలుసుకునేందుకు ఆఫీసర్ అనుమతి నివ్వలేదు. దానితో ఘనశ్యామ్‌దాస్‌కి ఒళ్ళు మండిపోయినది. "ఇక ముందు ఎలాంటి పరిస్థితులలోను బ్రిటిష్ పారిశ్రామికవేత్తలకు ఏ విధమైన సహాయము చేయకూడద"ని నిశ్చయించుకున్నాడు. వారితో తెగతెంపులు చేసుకున్నాడు. "ఆ రోజు నుండే భారతదేశములో బ్రిటిష్ పారిశ్రామికవేత్తల ఇష్టారాజ్యమునకు స్వస్తి చెప్పాల"నుకున్నాడు. ఆ ప్రయత్నములను ఆరంభించాడు. అప్పట్లో- మనదేశమునందు ఏ పరిశ్రమకు సాయము కావలసి వచ్చినా .. బ్రిటిష్ అధికారుల ఆధీనములో ఉన్న 'ఇంపీరియల్ బ్యాంక్' వొక్కటే ఆధారము! అదే అందరికీ దిక్కు!! అలాగే.... జనపనార రవాణాచేయాలన్నా.... బ్రిటిష్ యాజమాన్యములో వున్న నౌకలే శరణ్యము ! జనపనార వ్యాపారమంతా లండన్‌లోని 'బాల్టిక్ ఎక్స్ఛేంజ్' ద్వారా జరుగుతూ వుండేది. అందువలన జనపనార పరిశ్రమను స్వతంత్రముగా స్థాపించుటకు వెనుకాడాడు బిర్లా! కొన్నాళ్ళు ఆలోచించిన

తరువాత.... బిర్లా నేత పరిశ్రమవైపు మొగ్గుచూపించాడు. ఈ పరిశ్రమకు కావలసిన మగ్గము కూడా బ్రిటిష్‌నుండే దిగుమతి చేసికోవలసి వచ్చేది. ఢిల్లీకి చేరువగా కొంతమంది మిత్రుల సహకారముతో ఓ చిన్న కాటన్ మిల్‌ను స్థాపించాడు. ఒక ఏడాది గడిచేసరికి.... బిర్లా సత్తా ఏమిటో.... ఇతర పారిశ్రామికవేత్తలకు తెలిసిపోయినది.

బిర్లాకు 24 సం॥ల వయస్సు వచ్చేసరికి.... జనపనార, కాటన్ మిల్స్‌ను స్థాపించుటకు తగిన పూర్తి సమాచారమును సేకరించి, సిద్ధముగా ఉన్నాడు. రెండు పరిశ్రమలకు పూర్తి 'ప్రాజెక్ట్ రిపోర్ట్' రడీ అయినది. రెండు ప్రాజెక్ట్‌లను పూర్తిగా భారతీయుల ఆధీనములో నడుపుటకు నిశ్చయించి, చాలమంది భారతీయులకు షేర్సు ఇచ్చాడు. ఈ పరిణామమును గ్రహించిన బ్రిటిష్ ప్రభుత్వము కంగారుపడి, బిర్లా స్థాపించిన పరిశ్రమలకు సంబంధించిన రవాణా చార్జీలను నిర్దాక్షిణ్యముగా పెంచివేసినది.

"బిర్లాకు ఎటువంటి సహాయము అందీయ వద్ద"ని 'ఇంపీరియల్ బ్యాంక్'కు ఆదేశములను జారీ చేసినది. అయితే బిర్లా ఎంతమాత్రమూ నిరాశ చెందలేదు. ఒక బ్రిటిష్ పారిశ్రామికవేత్తద్వారా- ఒక బ్రిటిష్ బ్రోకర్ దగ్గర అధిక వడ్డీకి అప్పుతెచ్చాడు. తన జనపనార మిల్‌కు కావలసిన స్థలమునకు కూడా అతడు నానా తిప్పలు పడవలసి వచ్చింది. బిర్లా ఎన్నుకున్న ప్రతీ స్థలమును - ఒక బ్రిటిష్ పారిశ్రామిక సంస్థ అధికముగా డబ్బును చెల్లించి, అతనికి దక్కకుండా కొనివేసినది.

అలా బ్రిటిష్ ప్రభుత్వము నుండి ప్రతి విషయములోనూ ప్రతి ఎదురౌతూ వచ్చినా....బిర్లా వాటిని ధైర్యముతో ఎదుర్కొని, చివరికి ఏదో విధముగా ఒకచోట స్థలమును సేకరించి, ఫ్యాక్టరీలను కట్టగలిగాడు. ఆ తరువాత... జనపనార మిల్స్ యజమానుల అసోసియేషన్‌లో చేరుటకు ప్రయత్నించి ఫెయిల్ అయ్యాడు. అది బ్రిటిష్ యజమానుల సంస్థ కనుక.... బిర్లాను చేర్చుకోలేదు. బిర్లా సోదరుడైన జుగుల్‌కిషోర్ - జపాన్ నుండి వస్తువుల దిగుమతి చేసికొను వ్యాపారమునకుకూడా ఎన్నో అడ్డంకు

లను పెట్టినది బ్రిటిష్ ప్రభుత్వము ! జనపనార మిల్ స్థాపించిన తరువాత కాటన్‌మిల్‌ను కూడా ప్రారంభించాడు బిర్లా ! ఆ విధముగా కొంతవరకు విజయమును సాధించాడు. కాస్త నిలదొక్కుకున్న తరువాత... బ్రిటిష్ వారు ఏకచ్ఛత్రాధిపత్యము వహిస్తున్న- కాగితము, చేమూరు, అల్యూమినియమ్, ఓడలు వంటి పరిశ్రమల మీదకు తన దృష్టిని ప్రసరించాడు.

1919 లో- తన సోదరులతో కలసి 'బిర్లా బ్రదర్స్' సంస్థ ప్రారంభించాడు. బిర్లా కృషి వెనుక వున్న తపన ఒక్కటే ! "మన దేశము అన్ని రంగములలోను- స్వయంసమృద్ధి సాధించాల"ని ! ప్రతి చిన్న విషయమునకూ బ్రిటిష్ ప్రభుత్వమ్ మీద ఆధారపడుట, వారి పరిపాలనలో ప్రగ్గుటను చాల చిన్నతనముగా భావించాడు- ఘనశ్యాందాస్ !! ఆ సమయములోనే- అతనికి ఎందరో స్వాతంత్ర్య సమరయోధులతో పరిచయము లయ్యాయి. ఎందరికో విరాళాలిచ్చాడు. ఎన్నో ప్రజాహిత సంస్థలను నెలకొల్పాడు. హాస్పిటల్స్, విద్యాసంస్థలు ఏర్పాటు చేసి; ఎందరికో మార్గదర్శకుడయ్యాడు. ఆనాడు అతను పడిన బాధలకు, ఎదుర్కొన్న యిబ్బందులకు మరొకరైతే.... వెనుకడుగు వేసేవారేమో! కార్యదీక్ష, పట్టుదల మూర్తీభవించిన బిర్లా- ఈనాడు కోట్లకు వారసుడయ్యాడు. అంటే.... అతని దీక్ష, కృషి, పట్టుదల మున్నగువాటిని మనమంతా.... మార్గదర్శకముగా చేసికోగలగాలి. ఏ చిన్న పనియైనా- ఈ రోజులలో 'న్యూనత' క్రింద భావించకూడదు. కష్టాలు, ఇబ్బందులు ఎదురైనా వాటిని అధిగమించుటకు ప్రయత్నించడమే విజయమునకు నాంది!

ఏ వ్యక్తి నోటిలో బంగారు చెంచాను పెట్టుకొని జన్మించడు. తన తెలివిని, కృషిని, దీక్షను సక్రమ మార్గములో వినియోగించడమే ధనార్జనకు పునాదులౌతాయి! అభివృద్ధికి సోపానము !!

**పెడమార్గములో- ధనార్జన చేయవద్దు :** లాటరీలు, మట్కాలు "అతి సునాయాసముగా డబ్బు సంపాదించాల"న్న కాంక్షతో- ఫోర్జరీలు, సప్తగిరి స్వాముల వారిలా సర్వము సమీకరించుకొని పలాయ

నము చిత్తగించుట ఇవి ఈనాటి వ్యవస్థలో పెరుగుతూ వున్న- ధన
కాంక్షకు, అత్యాశకు పరాకాష్ఠ! ఇవి తాత్కాలికముగా ధనవంతులను చేయ
వచ్చు. ఆ ధనముతో ఏవో పదవులను చేపట్టి, మరింత సంపన్నుల
కావచ్చు. ఇదే ఈనాడు నూటికి అరవైమంది అనుసరించే ధోరణి
అయితే.... ఆ మిగిలిన నలభైమంది కష్టార్జితములను-, అరవైమంది
సమీకరించుకొని, తాము వటవృక్షములా ఊడలను దించుకున్నా.... అ
వాపేగాని..... బలుపు కాదు. దానికి తగిన మూల్యమును- ప్రాణము
రూపములో సమర్పించుకున్న సంఘటనలు కూడా వున్నాయి. కాబట్టి...
పెడమార్గముల జోలికి వెళ్ళకండి!

ఓ కిల్లీషాపు పెట్టుకున్నా, ఓ టీ స్టాల్ పెట్టుకున్నా, ఓ సోడాబం
నడిపినా- "డబ్బు" అనే రెండక్షరములకు ఇబ్బంది వుండదు.

పెద్దలు చెప్పినట్లు ఆహారము దగ్గఱ, వ్యవహారము దగ్గఱ మొహ
మాటము ఉండరాదు. చాల ప్లైన్‌గా వుండాలి. ఓపెన్‌గా వుండాలి
ముసుగులో గుద్దులాట వ్యవహారము లుండరాదు. మొహమాటపు వ్య
హారముల ఊబిలో కూరుకుపోకూడదు. ధైర్యము, చొరవలను ప్రదర్శి
చాలి. పరిస్థితుల కనుకూలముగా మనము కూడా మొహమాటముల
దూరముగా వుండాలి. "నేను పాత పద్ధతులను పట్టుకునే వ్రేలాడుతుంట
న"ని మొండికేస్తే నష్టము మరెవరిదో కాదు.... మనదే! కాబట్టి..
మొహమాటపడి, పెడమార్గములను పట్టకండి!

## ధనార్జనకు- ప్లానింగ్ ఉండాలి!

ఉడ్‌లాండ్ హోటల్స్‌కి- దక్షిణాదిన ఎంత గ్లామర్ ఉత్తరాదిన
ఓబరాయ్ హోటల్స్‌కి అంత గ్లామర్ ఉన్నది. డిమాండ్ ఉన్నది.
వెనుక ఎంత ప్లానింగ్ ఉన్నది. ఓబరాయ్ హోటల్స్ నిర్మాత ఒకప్పు
అతి చిన్న హోటల్‌లో సర్వర్‌గా పనిచేసాడు. ఈ విషయము ఎంతమంది
తెలుసో చెప్పండి! కాని.... అది నిజము! అటువంటి వ్యక్తి దేశ-విదేశా
లలో- పేరు- ప్రఖ్యాతుల నందుకున్న హోటల్స్ అధినేత కాగలిగాడంటే

అతని పట్టుదలను, ప్లానింగ్‌ను మనము అభినందించాలి. మనముచేసే ప్రతి పనికీ ముందుగా ఒక ప్లాన్ వేసికోవాలి. ఆ ప్లాన్ ప్రకారము ఒక పద్ధతిలో- మనము అనుకున్న పనిని పూర్తిచేయాలి. ముందుగా ప్లాన్ లేకుండా ఏ పనినీ చేయకూడదు. వక్రమార్గములో అసలు చేయకూడదు. అది అనేక అనర్థములకు దారితీస్తుంది. మీకు చెడ్డపేరు తెస్తుంది. మీరు పనిని పూర్తిచేయడమే కాదు.... "ఆ పనిని ఏ విధముగా పూర్తి చేసారు" అన్నది కూడా ముఖ్యమే! నీతిగా, న్యాయముగా, ప్రజాశిరాబద్ధముగా ప్రారంభించడమే మంచిది. అలా ప్రారంభమైన పని ఏదైనాసరే సత్ఫలితములను ఇస్తుంది. అవతలి వారిలో- విశ్వాసము, నమ్మకములను పెంచుతుంది. చేసిన పనివలన మనకు గౌరవము కలుగుతుంది. మనలోని నిజాయతీ లోపించినా, సన్మార్గములో ప్రారంభించకపోయినా, ప్లానింగ్ లేకపోయినా మనకు ఫలితములు సరియైనవి రావు. మనము ఖర్చు చేసిన సొమ్ము అంతా వృథా అయిపోతుంది.

## "సర్వేజనాః ధనినో భవన్తు"

మాకు బాగా తెలిసిన ఒక కుటుంబము వున్నది. ఆ కుటుంబము లోని వారంతా తెగమొహమాటస్థులు! వారిలో- అభిమానము హెచ్చు !! తిండి లేకపోతే.... వస్తుంటారు గానీ; కానిపనిని చేసి, కడుపు నింపుకోరు. ఇరుగు-పొరుగు వారిని "గిద్దెడు బియ్యము ఇమ్మ"ని కూడా యాచించరు. మహా మొహమాటస్థులు! వారి ఆదాయములు చాలీచాలనివి! కొడుకు ఓ కంపెనీలో పనిచేస్తూ వుంటాడు. అయితే.... ఆ కంపెనీ యజమాని జీతము మాత్రము ప్రతీ నెలా ఇవ్వడు. ప్రతీ నెలా కాదు ... రెండు నెలలకొకసారి కూడా ఇవ్వడు. ఇంటి అద్దె ఇవ్వకపోతే.... ఇంటి యజమాని ఊరుకోడు కదా? ఒక్కరోజు ఆలశ్యమైనా పెద్దపెట్టున గోలచేస్తాడు. "ఇంటిలోనుండి తక్షణమే ఖాళీచేయండి!" అని గద్దిస్తాడు. మరో అమ్మాయి జీతము బొటాబొటిగా ఇంటి అద్దెకు సరిపోయి, కాస్తంత మిగులుతుంది. దానితో వచ్చి

సంతవరకు బియ్యము కొంటాడు. మిగతా దినుసులు కూడా కొనుక్కో వాలి కదా.... ఎలా? పిల్లలచేత- ఇరుగు-పొరుగు ఇండ్లలో చాకిరీ చేయించి, డబ్బు సంపాదించాలి. కానీ వాడంతా.... చాకిరీ చేయించుకునే వారేగాని.... డబ్బు ఇచ్చేవారే కారు. పైగా ఆ ఎదిగిన పిల్లలను- నానా మాటలు అంటారు. పాపము పిల్లల మనస్సు నొచ్చుకుంటుంది. వాడవారు వేసిన అభాండములకు బాధపడతారు. మొగపిల్లలను, ఆడపిల్లలను నానా మాటలు అన్నా.... బాధపడతారు తప్ప.... తిరిగి అనరు. అది వారి మెతకదనమునకు- తార్కాణము! అతి మంచివారు అగుటవలన వారిని ఇరుగు-పొరుగువారు నానామాటలు అంటూ.... వారిచేత చాకిరీ చేయించు కుని కూడా వారికి పైకము చెల్లించరు. పైగా.... వారిని అభాండాలతో నిందించుట అమానుషము! మరి వారి జీవనము సాగుట ఎలా? వారి మనస్సులు ఎంతో మంచివి. ఇతరులకు-సాయపడాలనేది వారి ధ్యేయము! కానీ- అపార్థములకు, విపరీతార్థములకు వారి జీవితములు బలిఅయ్యాయి. కనీసపు అవసరములకు కూడా నోచుకోని అతి బీద బ్రతుకులు వారివి! ఇతరులు వారిని హేళనగా చూస్తూ, మాటలు అంటూ వుండేవారు. వారిని చూస్తే ఎంతో జాలివేస్తూ ఉండేది. ఏమి చేయగలము? ఆర్థికసహాయము అందిస్తే అపార్థము చేసుకుంటారేమోనన్న భయము! అందుకని వారికి సాహసించి ఎవరు ధనసహాయము చేయలేదు. వారి జీవితము వారికే గడ్డుగా అనిపించేవి. కష్టాలు శరీరమునిండా సోకిసోకి అలవాటై పోయింది. "డబ్బు లేద"న్న నిస్పృహ వారిని ఆవరించినది. ఏమి చేయడానికి తోచ లేదు. చూస్తూ-చూస్తూ వక్రమార్గములోకి మారలేరు. వారి సంస్కారము అందుకు అడ్డుగా నిలుస్తుంది. వారిని వెన్నుతట్టి, ఆదరించేవారులేరు. ఊర డించే వారు లేరు. ధనసహాయము చేసేవారు అసలే లేరు. వారి జీవితములు ఎంతో దుర్భరమయ్యాయి. "డబ్బులేనివార"నే చిన్నచూపు చూడకుండా.... "వారుకూడా మానవులే! పరిస్థితుల ప్రభావము వలన ఆ కుటుంబము

ఆర్థికముగా చితికిపోయినది. అటువంటి చితికిపోయిన కుటుంబము దేశములో ఎన్ని వేలున్నాయో చెప్పలేము! డబ్బు సంపాదించే వ్యక్తి.... డబ్బు సంపాదించలేని వ్యక్తికి- డబ్బు సంపాదించే మార్గమును సూచిస్తే... దేశము యావత్తూ ఈ రకముగా దుర్భిక్షమై వుండదు. "సర్వేజనాః సుఖినో భవంతు" అన్న మన ఆదర్శ విశ్వప్రేమను చాటుతూ వుంటుంది- అంద రికీ డబ్బుంటే!

అందరూ బాగుండాలి. అందరికీ కనీస సంపద వుండాలి. తినుటకు- తిండి, కట్టుకొనుటకు- గుడ్డ, వుండుటకు- ఇల్లు అమరివుండాలి. ఈ కనీస అవసరములు తీరకుంటే.... మన రాజకీయ విధానములను- "దివాళాకోరు విధానముల"ని అనక తప్పదు. మన రాజ్యాంగములో 'ఫండమెంటల్ రైట్స్' వున్నాయి. ప్రభుత్వము ఈ దేశములోని ప్రతి పౌరునికీ- కూడు, గుడ్డ, ఇల్లు సేకరించాలి. ఇది ప్రభుత్వ ప్రధాన కర్తవ్యము! కనీస బాధ్యత! దీనిని "కేంద్ర ప్రభుత్వము విస్మరించినద"నే చెప్పాలి. మనము ప్రతి పనినీ ప్రభుత్వ సహకారము లేకుండా చేస్తున్నాము. అందుకే.... భారీ ఎత్తున చేయలేకపోతున్నాము. మన రాజ్యాంగము 1947, ఆగస్టు 15వ తేదీన మనకు స్వంతమైనది. 1950, జనవరి- 26 నుండి రెగ్యులర్‌గా నడుస్తున్న ఆ ప్రదేశిక సూత్రములు మనందరికి అనువర్తిస్తాయి.

"హెల్ప్ ది హెల్ప్‌లెస్" అన్నది మన ప్రాథమిక సూత్రము ! తిను ! తినుపించు ! అలాగే- విను ! వినిపించు ! అదే మన ఎంబ్లెమ్.... అదే మన సింబల్ ! "పేదరికము" అన్నది ప్రపంచవ్యాప్తమైన సింబల్ ! అది మనకే ప్రత్యేకము కాదు.... ఇతర దేశములలో- మనకన్నా బాగా పేదవారున్నారు. వారిని ఆదుకొనుట సంపన్న దేశముల విధి ! విధిని నిర్వర్తించుట అందరి కర్తవ్యము ! సంపన్న దేశములు అట్టడుగు దేశము లను ఆర్థికముగా ఆదుకోవాలి. వారికి మేలు జరిపించాలి.

## ధనార్జన చేయుటకు- సంకల్పము కావాలి

మనము ఇంతవఱకు "డబ్బు సంపాదించడానికి- పట్టుదల, దీక్ష, కృషి, ఏకాగ్రత, ఓర్పు మొదలైనవి వుండాలని చెప్పుకున్నాము. అన్నింటికి మూలమైన, అతి ముఖ్యమైన విషయమును వదలివేసాము. అదేమిటో మీకు తెలుసా ?

"డబ్బు సంపాదించాల"నే కోరిక (సంకల్పము)! అది లేకపోతే.... మిగతావి ఎన్నివున్నా.... అన్నీ నిరర్థకములే ఔతాయి.

ఈ ప్రపంచములో ఏది సాధించాలన్నా.... ముందుగా కావలసినది- 'కోరిక !' అంటే.... "ఆ పనిని సాధించి తీరాల"నే సంకల్పము ! అది కూడా దృఢ సంకల్పము వుండాలి. "చేద్దామ"నే 'కోరిక' మాత్రమే సరిపోదు. ఆ కోరిక అతి తీవ్రముగా వుండాలి. దృఢముగా వుండాలి. "సాధించి తీరాల"నే తృష్ణ- మనిషిని అనునిత్యము ప్రేరేపించేలా వుండాలి. అతని తృష్ణ- అతనిని అనుక్షణము దహించివేస్తూ వుండాలి. తన కర్తవ్యమును ప్రతిక్షణమూ గుర్తుచేస్తూ వుండాలి. తనధ్యేయములను మఱవరాదు. అప్పుడే మనిషి దేనినైనా సాధించగలడు. నీ కోరిక తీవ్రతరమైనప్పుడు, నీ ధ్యేయము- నిర్మలమైనప్పుడు, నీ మార్గము సన్మార్గమైనప్పుడు- నీకు అపజయమంటూ వుండదు. మీరు చేయదలచుకున్న పనికి ముందుగానే పథకమును వేసికోవాలి. దానికి కావలసిన తతంగమంతా పూర్తి చేసికోవాలి. కావలసిన పరికరములను సమకూర్చుకోవాలి. ఆర్థిక వనరులను ఏర్పాటు చేసికోవాలి. చేసేపనిని గుఱించిన పూర్తి విషయ పరిజ్ఞానమును సమకూర్చుకోవాలి. ఏ విధమైన అనుమానములకు తావు ఇవ్వరాదు. పదిమంది సలహాలను వినరాదు. మీరు నిర్ణయించుకున్న పంథాలోనే ప్రయాణము చేయాలి. మీ ధ్యేయమును- సాధించుటలో ఎన్ని అవాంతములు అడ్డమొచ్చినా.... మొక్కవోని పట్టుదలతో, ధైర్యముతో, ముందుకు సాగిపోవాలి. అదే ధీర పురుషుని లక్షణము!

"ఎడ్విన్ C. బేరన్స్" అనే సామాన్య వ్యక్తి- 'థామస్ A. ఎడిసన్' ఆఫీస్‌లో పార్ట్‌నర్‌గా చేరాలనుకున్నాడు- చేరాడు. అది సామాన్యులకు సాధ్యమయ్యే పనికాదు. అయినా.... ఆయన తీవ్రమైన సంకల్పముతో ఆ పనిని సాధించగలిగాడు. బేరాన్స్- ఎడిసన్ పార్ట్నర్ అయ్యాడు. అతని జీవిత లక్ష్యమును సాధించాడు. తీవ్రమైన విల్‌పవర్ మీ సంకల్పమునకు అండగా నిలిస్తే.... మీరు ప్రపంచములో సాధించలేని పని" అంటూ వుండదు.

ఒకసారి ఓ యోధుడు తనకున్న చిన్న సైన్యముతో బలవంతుడైన శత్రువును తప్పనిసరిగా ఎదుర్కోవలసి వచ్చినది. అతడు తనకున్న కొద్దిపాటి సైనికులను- పడవల మీద ఎక్కించుకుని, శత్రురాష్ట్రములోకి అడుగిడి, వెంటనే....తన అనుచరులతో- "మనము వచ్చిన పడవలన్నింటినీ తగులబెట్టండి !" అని ఆజ్ఞాపించాడు. సైనికులకు అర్థము కాలేదు. "చూస్తారేం.... తగులబెట్టండి !" అని గద్దించాడు. వారు పడవలన్నింటినీ తగులపెట్టేసారు. సముద్రములోని పడవలన్నీ జ్వాలలకు ఆహుతి అయ్యాయి.

ఆ యోధుడు సైనికులను ఉద్దేశించి.... "మీరు తిరిగి వెళ్ళుటకు పడవలు లేవు. కనుక.... మనము శత్రువుతో పోరాడి మరణించడమో లేక వారిని జయించి, విజయలక్ష్మిని వరించడమో తప్ప.... వేరే మార్గము లేదు. 'విజయమో.... వీరస్వర్గమో' మీరే నిర్ణయించుకోండి ! అన్నాడు. వారిలో మొండి ధైర్యమును నూరిపోసాడు. పిరికితనమును పారద్రోలాడు. వారు తీవ్రకాంక్షతో- "విజయము సాధించాల"ని పోరాడారు. చివరికి విజయలక్ష్మిని వరించారు. కనుక.... మనము చేసే ప్రతీ పనిని ఆషామాషిగా చేయకూడదు. చాలా సిన్సియర్‌గా చేయాలి. "విజయము సాధించి తీరాలి. లేకపోతే.... మనకు భవిష్యత్తే లేదు" అన్న తీవ్ర కాంక్షతో- ఏ పనినైనా చేయాలి. "గెలిచినా.... ఓడినా ఫరవాలేదు" అన్న చులకన భావము వుండరాదు. అప్పుడే.... మన కృషి, ప్రయత్నము ఫలి

స్తుంది. అవసరమునకు మించినది ఏదీలేదు. అవసరమున్నప్పుడు మనము ఏ విధముగానైనా దానే సాధించి తీరుతాము. అవసర సమయములో- సిగ్గు, భయము, బిడియము ఏవీ అడ్డమురావు. మానవుడిలో- ఈ విధమైన కాంక్ష జ్వాల రగులకపోతే అతడు ఏమీ సాధించలేడు.

చికాగో నగరములో ఒకప్పుడు ఓ పెద్ద అగ్నిజ్వాల అక్కడి మార్కెట్‌లోని- పెద్ద పెద్ద దుకాణములను దహించివేసినది. వ్యాపారస్తులు అందరూ వీధిలోకి వచ్చి- మంటలను, పొగలను చూస్తూ.... నిశ్చేష్టులై, నిలబడి చూస్తూ వుండిపోయారు. వారి షాప్‌లన్నీ సమూలముగా దగ్ధమైపోయాయి. వారంతా తరువాత ఒక సమావేశము ఏర్పాటు చేసుకున్నారు. ఒక్కరు తప్ప.... మిగతావారంతా- చికాగో నగరమును విడిచి, మరోచోటుకి వెళ్ళి వ్యాపారము చేసికొని జీవించుటకు నిశ్చయించుకున్నారు. వారితో ఏకీభవించని ఆ ఒక్క వ్యక్తి- తన షాప్‌వున్న వైపు వ్రేలితో చూపుతూ.... "మిత్రులారా- నేను నా షాప్ వున్న చోటులోనే.... ప్రపంచములోకెల్లా అతి పెద్దదైన మరో షాప్‌ను కడతాను.... అదీ నా శపథము చికాగోను మాత్రము వదలను- ఎక్కడికీ వెళ్ళను" అన్నాడు. "అది కూడా తగులబడినా ఫరవాలేదు. కాని.... ఆ ప్రదేశమును మాత్రము విడిచిపెట్టను" అన్నాడు. ఇది జరిగి వంద సంవత్సరములు దాటినది. అక్కడే అతడు మరో స్టోర్‌ను కట్టాడు. అది ఆకాశమును అంటుతూ వున్న పెద్ద భవంతి ! అతని కోరికను నెఱవేర్చుకున్నాడు. అక్కడేవుండి విజయము సాధించిన ఆ వ్యక్తి పేరు- "మార్షల్ ఫర్డ్" మిత్రులు చికాగోను వదలివెళ్ళి, అక్కడ కూడా యిబ్బందుల పాలయ్యారు. "పోగొట్టుకొన్న చోటనే- వెతుక్కోవా"లంటారు. ఏనాటికైన మనము పోగొట్టుకున్నది అక్కడే దొరుకుతుంది. నిలదొక్కుకున్న వాడు నిజముగా విజయమును- సాధించగలడు. నిరాశతో- సీరు కారినవాడు నష్టముల పాలౌతాడు.

డబ్బు అవసరము వున్నవాడికి- డబ్బు విలువ తెలుస్తుంది. అది

"సంపాదించా"లన్న తపన వుంటుంది. కోరిక వుండగానే సరికాదు. ఆ కోరికను నెరవేర్చుకునే స్తోమతను సంపాదించుకోవాలి. తపనను పెంచు కోవాలి. కృషి చేయాలి- సాధించాలి.

## మీ కోరికలను తీర్చుకొనుటకు- ఆరు సూత్రములు

1] మీరు సంపాదించవలసిన మొత్తము ఎంతో.... దానిని ముందుగా మీ మనస్సులో అనుకోండి ! "నాకు బోలెడు డబ్బు కావాలి" అని అనుకోకండి ! ఇది మీకు ఫలితమును ఇవ్వదు. కచ్చితముగా మీకు "అత్యవసరముగా కావలసినదెంత ?" "ఇంత రొక్కము" అని డిఫె నెటిగా అనుకోవాలి.

2] మీరు కోరిన డబ్బును సంపాదించుటకు- మీరేమి చేయదలచు కున్నారు ? "సంథింగ్ ఫర్ నథింగ్" కాదు.

3] ఒక నిర్దిష్టమైన పని లేక వ్యాపారమును నిర్ణయించుకోండి ! కోరిన డబ్బును ఫలానా తేదీలోగా సంపాదించాలనుకోండి !

4] దానికి సరియైన ఒక ప్లాన్ (పథకము)ను వేసికోండి ! వెంటనే ఆ ప్లాన్ ప్రకారము అమలు చేయండి ! మీరు సిద్ధముగా వున్నా.... లేకున్నా ప్రారంభించండి ! మీ ప్లాన్‌ను అనుబజరుపుటలో జాప్యము చేయకండి !

5] మీకు కావలసిన మొత్తము, ఆ మొత్తమును ఎంత కాలములో సేకరించాలో, ఏ పథకము ప్రకారము సేకరించాలో, దానికి మీరు చేయ వలసిన పని ఏమిటో.... అన్నీ వివరముగా ఒక పుస్తకములో వ్రాసికోండి !

6] మీరు వ్రాసుకున్న దానిని- బిగ్గరగా పైకి చదవండి ! రోజూ రెండు పర్యాయములు చదవండి ! ఉదయము- సాయంత్రము చదవండి ! చదువుతూ వుండగానే... మీరనుకున్న పైకము "చేతికందినట్లు"గా ఊహిం చండి !

పై విధముగా ఊహించుట వలన మీకు "నిజముగా డబ్బు అంది నంత" ఆనందము కలుగుతుంది. ఆ ఆనందము మీరు చేయదలచుకున్న

పనికి కావాలిస్తావలెనా పనిచేస్తుంది. దీనినే ఆంగ్లభాషలో "బర్నింగ్ డిజైర్" అంటారు. ఇది వున్నవారే... ఏదైనా సాధించగలరు. మీరు తప్పక మీ ధ్యేయమును సాధించుటకు ఈ మనస్తత్వమును పెంచు కోండి! మిమ్ములను మీరు ఒక మిలియనీర్‌గా ఊహించుకోండి ! ఊహించుకున్నారా ?

మీకు ఈ రకమైన ఆలోచన, ఊహ వింతగా వున్నట్లు తోస్తుంది. అయినా ఫరవాలేదు... అనుకొనుటలో తప్పులేదు కదా ? ఆ విధముగా ఊహించుకున్న ఎందరో కార్మికులు- వారు పనిచేసే ఆ సంస్థలకు యజ మానులు కాగలిగారు. తీక్షణమైన కాంక్ష వుంటే... తీరనిదంటూ ఏదీ లేదు. ఎడిసన్‌వంటి మహామహులు- 'షట్‌సూత్ర పథకము'లను ఆమో దించి ఆచరించారు. అత్యంత ఉన్నత పదవులను అలంకరించారు.

ఈ షట్సూత్ర పథకములను అవలంబించుటకు ఏమి శ్రమపడ నక్కరలేదు. కేవలము అనుకొంటే చాలు ! అదీ నలుగురిలో కాదు. మీలో మీరే ఏకాంతముగా అనుకోండి ! మీకు నైతికముగా ఎంత బలము పెరుగుతుందో తెలుస్తుంది. ఆలోచించండి !! ముందుగా ఆలోచించు కోండి !! తరువాత ఆశించండి !!! "రావాల"ని గట్టిగా కాంక్షించండి ! ఆ ప్రకారము వేయండి ! పక్కాగా ప్లాన్ మీరు గాఢముగా ప్రయత్నిస్తే తప్పక... మీ కోరిక నెరవేరును.

ఎడిసెన్- "ఎలెక్ట్రిసిటీతో వెలిగే బల్బును కనుక్కోవాల"ను కున్నాడు. తపనపడ్డాడు. చివరికి విజయము సాధించాడు. ఈనాడు మనము చూస్తున్న ఎలెక్ట్రిసిటీ బల్బులను సృష్టించిన మహనీయుడు- థామస్ ఎ. ఎడిసన్ !

అదే విధముగా 'మార్కోని' రేడియో, T. V. ని కనుక్కున్నాడు. "పిచ్చివాడ"ని మార్కోని స్నేహితులు, అతడి నొక మెంటల్ డాక్టర్ దగ్గరకు కూడా తీసుకుని వెళ్లారు.

'రైట్ బ్రదర్స్' ఏరోప్లేన్ కనుగొన్నారు. వీరందరు తపనతో- కార్యములను సాధించినవారే !

# విశ్వాసమే - ధనార్జనపరుల ఆయుధము

మనము అనుకున్నది సాధించుటకు- సంకల్పముతోపాటు 'విశ్వాసము' కూడా ఉండాలి. 'విశ్వాసము' రెండు విధములుగా వుండాలి. 1] మీమీద మీకు విశ్వాసము ! 2] భగవంతుడు లేక కాలము మీద మీకు విశ్వాసము !! ఈ రెండూ ఉన్నప్పుడే... మనము అనుకున్న విధముగా అన్నీ సమకూరుతాయి.

"విశ్వాసము" అన్నది అమృతము వంటిది. అది మానవుడికి జీవితమును, శక్తిని, ఆలోచనలకు తగినట్లుగా కార్యక్రమమును నెఱవేర్చు నేర్పును ఇస్తుంది. విశ్వాసముతోపాటు ప్రార్థన లేక ధ్యానముకూడా తోడైతే ఆ కార్యక్రమమును- కాలము (భగవంతుడు) దిగ్విజయము చేస్తుంది.

"అనేక మానవతీతమైన పనులు విశ్వాసము ఉంటే నెఱవేఱుతాయ"ని మన పెద్దలంటారు. ఈ సత్యమును అన్ని దేశముల ప్రజలు నమ్ముతారు.

మనము ధనవంతులు కావాలంటే... మంచి విశ్వాసము వుండాలి. కాలము మనలను ఏ విధముగా నడిపించాలనుకున్నదో ఆ విధముగా నడిపిస్తుంది. విశ్వాసమన్నది బయటనుండి కలిగేది కాదు. మనకు గాను మనము ఆటోసజెషన్స్‌ను ఇచ్చుకొనుటద్వారా విశ్వాసము ఏర్పడుతుంది. ప్రతీ వస్తువును, ప్రతీ దేవతను చూపిస్తూ... మన పూర్వులు "విశ్వాసమును వుంచండి !" అని చెప్పారు గాని... "ఎవరికి వారు ఆటోసజెషన్స్ ద్వారా విశ్వాసమును ఏర్పఱచుకోవా"లని చెప్పలేదు. భక్తి, విశ్వాసము మానవుడిని మహనీయునిగా మలుస్తుంది. ఉన్నత స్థాయికి తీసుకుని వెళుతుంది.

మనము ఇచ్చుకునే సజెషన్స్ కూడా 'పాజిటివ్ సజెషన్స్'ను ఇచ్చుకోవాలి గానీ.... 'నెగిటివ్ సజెషన్స్'ను ఇచ్చుకోకూడదు. ఏదైనా

పనిచేసే ముందు "ఆ పనికి అడ్డంకులు వస్తాయ"ని, "మధ్యలోనే ఆ పని ఆగిపోవచ్చు"ని, "మనము నష్టపోతామ"ని ఆలోచించకూడదు. "మన పని సక్రమముగా జరుగుతుంద"ని, "అడ్డంకులు ఏవీ రావ"ని, "మన గమ్యమును భద్రముగా చేరుతామ"ని, "మనము చేసేపనిలో తప్పక విజయము చేకూరుతుంద"నీ అనుకోవాలి. "ఓడిపోతామ"ని అనుకోకూడదు. మనిషి ఆశతో జీవిస్తాడు. నిరాశ అతణ్ణి క్రుంగదీస్తుంది. "మనము ఆ పనిని చేయలేమ"న్న 'నెగెటివ్ ఆలోచన' మన మైండ్‌లోకి ప్రవేశిస్తే.... ఆ పని ఇక ముందుకు సాగదు. కాబట్టి.... "చేసే పని సక్రమముగా జరుగుతుంద"ని ఆటో సజెషన్స్‌ను ఇచ్చుకుంటూ వుండాలి. ఇది మనకు మనోబలమును చేకూర్చుతుంది. "పదేపదే అంటే.... అబద్ధము కూడా నిజమైపోతుంది" అని పెద్దలంటారు. "బ్రాహ్మణుడు-మేక" కథ మనకి తెలిసినదే! పదిమంది దొంగలు- "బ్రాహ్మణుని దగ్గఅనుండి మేకను కాజేయుటకు ప్లాన్ వేసుకుని.... వారు విడివిడిగా, దూరదూరముగా నిలబడి; బ్రాహ్మణునితో.... "అదేమిటి? మీరు సునకమును తీసుకుని వెళతున్నారు!" అని పదిమందీ పదిచోట్ల.... పదిసార్లు అనేసరికి.... "నిజముగా సునకమే"నని నమ్మి.... బ్రాహ్మణుడు- మేకను విడిచిపెట్టాడు. వెంటనే దొంగలు దానిని తీసుకుపోయి చంపి, తినివేసారు. కనుక.... పదేపదే పునశ్చరణ చేయుటలో- మహాత్మ్యము వున్నది. జపము చేసేటప్పుడు- మాలను వాడుతారు. ఒక పూసను త్రిప్పినప్పుడు ఒకసారి మంత్రజపము చేయాలి. అలా రిపీట్ చేయుటవలన అనంతమైన శక్తికలుగుతుంది. మనము పదేపదే "అలా జరగాలి" అని ఆశిస్తే.... అది తప్పక అదేవిధముగా జరిగి తీరుతుంది. అందుకే.... మనము మన పిల్లలను- పదేపదే "చావు" అని తిట్టకూడదు. ఇది వారికి శాపముగా మారుతుంది.

కనుక ... మనము "ఎల్లప్పుడూ మంచి జరగాలి" అని ఆశించాలి. "చెడుతలంపు" అన్నది మన దరికి రారాదు. ఇనుపముక్క- కూడా- అయ

స్కాంతముతో రుద్దగా-రుద్దగా.... అది కూడా అయస్కాంతముగా మారి పోతుంది. అదేపనిగా ఒక విషయమును గురించి ఆలోచిస్తూవుంటే.... అది ఏదో ఒకనాటికి అయితీరుతుంది. దీనినే "భ్రమర-కీటకన్యాయము" అంటారు. "కీటకము ఎల్లప్పుడూ భ్రమరమును గురించే ఆలోచిస్తూ.... ఒకనాటికి- 'కీటకము' కూడా భ్రమరమే అయిపోతుంది. ఇదేవిధముగా మానవుడు- భగవంతుని గురించి ఆలోచించి- ఆలోచించి.... ఒకనాటికి ఆ భగవంతుడే అయిపోతాడు" అని దీని భావము!

ఇప్పటివరకు "డబ్బు సంపాదించాలన్న కోరిక వుండాల"ని, ఆ కోరిక తీరుటకు- తనపైన తనకు ప్రగాఢ విశ్వాసము వుండాల"ని, "కాలము లేక దైవము అనుకూలించుటకు- చింతన అవసరమ"ని తెలుసుకున్నాము! కోరిక, విశ్వాసము వున్నంతమాత్రమున మనకు డబ్బు వచ్చేస్తుందా? రాదు! దీనికి ప్లాన్ ప్రకారము ప్రయత్నము చేయాలి. పట్టుదల, దీక్ష, ఏకాగ్రతలు వుండాలి. విసుగుదల, కోపము అసలు వుండకూడదు. అడ్డంకులు వస్తూ వుంటాయి. అయినా.... ముందుకు ధైర్యముగా, ఆత్మ విశ్వాసముతో, దృఢ సంకల్పముతో సాగిపోవాలి. మన గమ్యము చేరేంత వరకు విశ్రమించకూడదు. మంచి సారవంతమైన పొలములో ఒక విత్తనము నాటితే.... అది మొలిచి, పెద్దదై, ఎంతో విస్తరించి, ఫలితమును ఇస్తుంది. దానికి బోలెడంత చాకిరీ చేయాలి, నీరు పెట్టాలి, ఎరువులు వేయాలి, దుక్కి దున్నాలి, అప్పుడే అది సత్ఫలితమును ఇస్తుంది. అదే విధముగా- "డబ్బు సంపాదించాల"న్న వుద్దేశ్యము కలుగగానే.... డబ్బు ఆకాశమునుండి ఊడిపడదు. దీనికోసము చేయవలసిన శ్రమను ఏమరు పాటు లేకుండా చేయాలి. శ్రమతోపాటు కొంత అదృష్టము కూడా కలిసి రావాలి. అప్పుడే మనకు ఆ డబ్బు అందుతుంది.

# ధనమార్జించువారికి ఆత్మవిశ్వాసము కావాలి
## (ఆత్మవిశ్వాసమునకు ఐదు సూత్రముల పథకము)

1] "నేను కోరిన పైకమును పొందగలను. ఆ ఆత్మ విశ్వాసము నాకున్నది. అందుకు అవసరమైన సమర్థత, యోగ్యతలు కూడా నాకు వున్నాయి" అన్న భావన మొదటి సూత్రము !

2] "నాలోని భావములన్నీ కార్యరూపమును దాల్చగలవు. ఆ నమ్మకము నాకున్నది. కనుక.... నేను ప్రతీరోజూ అరగంటసేపు నా భావములమీద ఆలోచన జరుపుతాను. నేను ఏది సాధించాలో.... నాలో నేనే నిర్ణయించుకుంటాను. నాకు నేనుగా నేనేమి కావాలో ఒక నిర్దిష్ట మైన, సమగ్రమైన, సంపూర్ణమైన చిత్రమును ఏర్పఱచుకుంటాను" అన్న భావన రెండవ సూత్రము !

3] "ఆటో సజెషన్స్ ద్వారా నేను పదే పదే ఏదైతే అనుకుంటానో... అదే అవుతుంది. 'నాలో ఆత్మవిశ్వాసము పెరగాల'ని ప్రతీ రోజూ 10 నిమిషములపాటు అనుకుంటూ వుంటాను" అన్న భావన మూడవ సూత్రము !

4] "నేను నా జీవితములో సాధించదలచుకున్న లక్ష్యమును- కాగితముమీద వ్రాసుకున్నాను- వ్రాసుకున్న విషయమును సాధించే వఱకు నేను విశ్రమించను" అన్న భావన నాలుగవ సూత్రము !

5] "నిజాయతీగా సంపాదించిన సంపాదన ఒక్కటే... కల కాలము నిలిచి ఉంటుంది. మోసముతో సంపాదిస్తే... మోసముగానే పోతుంది ఇతరులకు నష్టము కలిగే విధముగా, ఇతరులకు బాధ కలిగే విధముగా నేను డబ్బును సంపాదించను. పదిమంది సహకారముతో, పది మంది ఆశీస్సులతోటే నేను ఆస్తిని సంపాదిస్తాను. నేను ఇతరులకు సహాయపడతాను. నేను అనునిత్యము వారి సహాయ-సానుభూతులను అర్థిస్తాను. ఇదే నా తత్వము ! నా పదకోశములో- ద్వేషమునకు, అసూయకు, మత్సరమునకు, స్వార్థమునకు సినిసిజ్మ్‌కు తావులేదు. సర్వ

మానవ ప్రేమను కలిగివుండుటయే నా కోరిక ! ఇతరులను ద్వేషించుట వలన- లాభము లేకపోగా... నష్టము కలుగవచ్చును. నేను ఇతరులను నమ్ముతాను గనుక... ఇతరులు కూడా నన్ను నమ్ముతారు. ఈ విధముగా వ్రాసుకొని రోజూ- నాలో నేను పునశ్చరణ చేసుకుంటాను. ఈ భావము నా మనస్సులో స్థిరపడి, నేను విజయము సాధించుటకు అవి ఎంతో దోహదము చేస్తాయి. అన్న భావన ఐదవ సూత్రము !

ఆటోసజెషన్స్ : ఆటో సజెషన్స్‌ను ఎప్పుడూ పాజిటివ్‌గా ఇచ్చుకోవాలేగాని, నెగిటివ్‌గా ఇచ్చుకోకూడదు. మీ సజెషన్స్ బట్టే... మీ ఇంప్రెషన్స్ కూడా మలచబడతాయి.

నెగెటివ్ ఆలోచనల వలన ఏమి జరుగుతుందంటే ... ఈ ఆలోచనలు 'సబ్‌కాన్షస్ మైండ్' మీద బాగా పనిచేస్తాయి. మనము వాటికి అందించే మేటర్ మీద 'నెగెటివ్ ఇంప్రెషన్స్' ఏర్పడి, మనము చేయ దలచుకున్న పనికి అవరోధములు ఏర్పడతాయి.

కరెంట్ వలన ఇండస్ట్రీలోని మెషన్ వీల్స్ తిరుగుతాయి. వాటి వలన ఉత్పత్తి పెరుగుతుంది. అదే కరెంట్‌ను సద్వినియోగపఱచక పోతే... మెషిన్స్ చెడిపోయి, వీల్స్ తిరుగుట మాని ఉత్పత్తి ఆగిపోతుంది. కనుక... కరెంట్‌కు పాజిటివ్ నెగిటివ్‌శక్తులు రెండు వున్నాయి. మనము పాజిటివ్ శక్తిని మాత్రమే వినియోగించుకోవాలి. నెగిటివ్ శక్తిని ఉపయోగించకూడదు. అది విధ్వంసమునకు దారితీస్తుంది.

తెరచాప ఎత్తగానే... గాలి వాలును బట్టి పడవ-తూర్పుకుగాని, పడమరకుగాని; ఉత్తర—దక్షిణములకు గానీ కదలి సాగుతుంది. అదే విధముగా మనము ఇచ్చుకునే ఆటో సజెషన్స్ వలన ఆలోచనలు పెరుగుట గాని, తఱగుట జరుగుతుంది. ఇక్కడ మీ ఆలోచనా సరళే 'తెరచాప'గా పని చేస్తుంది. "యద్భావం తద్భవతి" మనము ఎలా తలుస్తామో... అదే విధముగా జరుగుతూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు మనము ఇచ్చే సలహాలు అవతలి వారికి అమోఘముగా పనిచేసి, వారిని

కోటీశ్వరులను చేస్తాయి. కనుక... "ఐడియాలకు విలువ లేద"ను కొనుట ఘోర పొరపాటు ! 1900 సం॥ము జూన్‌లో- "లొవెల్" అనే అమెరికన్ మేధావి "న్యూయార్క్ వరల్డ్ టెలిగ్రామ్" అనే మేగజైన్‌నందు ఇచ్చిన సలహా మేరకు- 'యునైటెడ్ స్టేట్స్ స్టీల్ కార్పొరేషన్' గొప్ప అభ్యున్నతికి నోచుకున్నది. కనుక... మన భవిష్యత్తు మన ప్రవర్తన మీద ఆధారపడి వుంటుంది.

## ధనార్జనకు - 'ఏకాగ్రత' కావాలి !

డబ్బు సంపాదించుటకు- ఏకాగ్రత ముఖ్యము ! మనము ఏ వృత్తి ద్వారా డబ్బు సంపాదించాలనుకొన్నామో.... ఆ వృత్తిమీద మీకు అమితమైన ఏకాగ్రత వుండాలి. చేసే పని ఎంత చిన్నదైనా సరే.... ఎంత పెద్దదైనా సరే.... ఏకాగ్రతను విడనాడరాదు.

"లాయడ్ జార్జ్" అనే మేధావిని ఒకసారి- "మీ గొప్పతనమునకు కారణభూతు లెవర"ని అడిగారట! అప్పుడు వారు "నేను తల దువ్వుకునేటప్పుడు- దువ్వుకొనుటనుతప్ప.... మరే విషయమును ఆలోచించను" అన్నాడట! ఈ ఏకాగ్రతే అతనిలోని ఆధిక్యతకు కారణము!

మనకు 'మహాభారతము'లోని ద్రోణాచార్యుల వారి కథ తెలుసుగదా!

ఒకసారి ద్రోణాచార్యులవారు తమ శిష్యు లందరినీ పిలిచి- "చెట్టు మీదనున్న చిలక ముక్కును బాణముతో కొట్టాలి" అని ఆదేశమిచ్చాడు. ఒక్కొక్కరు తన దగ్గరకు రాగానే.... వారిని ప్రశ్నలు వేయసాగాడు.

"నీకేమి కనిపిస్తూ వున్నది?"

"చెట్టు కనిపిస్తూ వున్నదా?" "కొమ్మ కనిపిస్తూ వున్నదా?"

"చిలుక కనిపిస్తూ వున్నదా?" "చిలుక ముక్కు కనిపిస్తూ వున్నదా?" అంటూ ప్రశ్నలను వేయగా.... ఒకరు "చెట్టు"అనీ, మరొకరు "చిలుక" అని, ఇంకొకరూ "అన్నీ" అని అన్నారు. ఎవరూ చిలుక

ముక్కును బాణముతో కొట్టలేకపోయారు. చివరికి అర్జునుడిని పిలిచాడు-ద్రోణుడు!

ద్రోణుడు : "చెట్టు కనిపిస్తూ వున్నదా ?"
అర్జునుడు : "లేదు !"
ద్రోణుడు : "కొమ్మ కనిపిస్తూ వున్నదా ?"
అర్జునుడు : "లేదు !"
ద్రోణుడు : "చిలుక కనిపిస్తూ వున్నదా ?"
అర్జునుడు : "లేదు !"
ద్రోణుడు : "చిలుక ముక్కు కనిపిస్తూ వున్నదా ?"
అర్జునుడు : "కనిపిస్తూ వున్నది !"
ద్రోణుడు : "కొట్టు" అన్నాడు ద్రోణాచార్యుడు !

అర్జునుడు బాణము వదిలాడు. చిలకముక్కు తెగి నేల వ్రాలింది. ఇదే "ఏకాగ్రత" అంటే! చేసే పని తప్ప మరేది మనకు కనిపించ కూడదు.

ఆ తీవ్ర ఏకాగ్రతే అతని విజయమునకు కారణము! ఏకాగ్రత కుదరాలంటే.... మనస్సు చలించరాదు. క్రమశిక్షణ అవసరము.

పనిపట్ల శ్రద్ధ : మనము కొన్ని ఆఫీస్‌లకు వెళ్ళిచూస్తే.... ఏ ఒక్కరో తమ సీట్‌లో కూర్చొని వుంటారు. చాలమంది ఎప్పుడు తిరుగుతూనే ఉంటారు. పని ఏమాత్రము సాగదు. ఎక్కువమందికి ఆఫీస్ పని మీద శ్రద్ధ లేదు. చాలమందికి వారి 'హక్కు'ల మీద వుండే శ్రద్ధ- వారి 'బాధ్యత'ల మీద వుండుటలేదు. పనిపట్ల అలసత్వము పనికిరాదు. దీనినే "మిడత మనస్సు" అంటారు. మిడత ఒక దానిమీద కుదురుగా వుండదు. ఎప్పుడూ ఎగిరిపోతూ వుంటుంది. ఎనిమిది గంటలకూ- ఒక గంటసేపు కూడా శ్రద్ధగా పనిచేయరు. అలా అయితే.... ఆఫీస్‌లో- పనులే విధముగా జరుగుతాయి. రోజులు దొర్లిపోతూ వుంటాయి. టైమ్‌వేస్ట్ అయిపోతూ వుంటుంది కానీ.... పనులు మాత్రము కావు. దీనికి కారణము

చేసే పనిమీద శ్రద్ధ లేకపోవుట, పనివారిమీద సరియైన అజమాయిషీ లేక పోవుట! ఆఫీసర్స్ కూడా ఇంతే కనుక.... "యథారాజా తథాప్రజా" అన్నారు.

ఆఫీస్‌లలో ఎవరినీ ఏమీ అనలేము. "పని చేయలేదే" అనలేము. "వారి దగ్గఱి బంధువు- ఏ M. L. A. నో, M. P. నో, రాష్ట్రి మంత్రో లేక కేంద్ర మంత్రో జోక్యము కలుగచేసుకుంటాడ"ని ఆఫీసర్స్‌కి భయము! వీరికి "ఉద్యోగములకు ఎసరు వస్తుంద"న్న జంకు ! రాజకీయ-నాయకులు ప్రతి చిన్న విషయములోనూ జోక్యము కలుగజేసికొనుట వలన పనులు కావు. అడుగుటకు ఎవరికీ ధైర్యం లేదు. మనదేశములోని పరిస్థితి ఈనాడు ఈ విధముగా వున్నది. దేశము పురోగమించాలంటే ఎలా ?

**ధనార్జన చేయువారు - రహస్యములను దాచాలి :**

ఒకసారి 'స్టాలిన్' కుమార్తె 'స్వెట్లెనా' ఇండియాలో కొంతకాలము రహస్య స్థావరమును ఏర్పఱచుకుంది. ఆమె "ఇందిరాగాంధీతో కొన్ని నిమిషములపాటు ఏకాంతముగా మాట్లాడాల"ని ఎన్నోసార్లు ప్రయత్నించినా లాభము లేకపోయినది. ఎప్పుడూ ఎవరో ఒకరు ఆమెతో గంటలకొద్దీ, మాటలాడుతూ వుండేవారట ! మనదేశములో- సీక్రెట్ విషయములను కూడా బహిర్గతముగా చర్చించుట పరిపాటి ! పబ్లిక్‌లో- సీక్రెట్ విషయములను చర్చించరాదు. పూర్వము వీటిని "దర్బార్"లనేవారు ! బాహాటముగా ప్రతీ విషయమును దర్బార్‌లలో చర్చించేవారు. ప్రతి చిన్న రహస్యమూ బట్టబయలౌతుంది. ఇది సమర్థనీయం కాదు. అన్ని విషయములను- అందఱిముందూ బాహాటముగా చర్చించరాదు. అది అనేక అనర్థములకు దారితీస్తుంది. ఇందువలన మన దేశపు రహస్యములు పొరుగు దేశములవారికి తెలిసిపోతాయి. దీనివలన చాల ప్రమాదములు వుంటాయి.

కొంతమంది మన ఆఫీస్ విషయములను- బయటివారి ముందు చర్చిస్తూ వుంటారు.

అల్లరి తగదు : మనకొంతమంది వారిక్రింద పనిచేసేవారిని బయటివారి ముందు కించపరుస్తారు. ఇది చాల చెడ్డపని ! దీనివలన గౌరవం తగ్గుతుంది పనివారికి- యజమానులపట్ల అభిమానము తగ్గుతుంది. వారి పనిలో- మరింత ఆలస్యము పెరుగుతుంది. ఆఫీస్‌లో పనులన్నీ స్తంభించిపోతాయి... ఎవరూ ఏ పనికీ బాధత వహించరు. కస్టమర్స్‌కి ఇబ్బంది కలుగుతుంది. ఆఫీస్ మీద, అందులోని పనివారి మీద దుష్ప్రచారము సాగుతుంది. స్ట్రైక్స్, ధర్నాలు ప్రారంభమౌతాయి. అంతా అరాచకం ! కేబినెట్ మంత్రుల గదులు కూడా ఫైటింగ్ హాల్‌లా మారితే.... దేశ గౌరవము ఎలా కాపాడబడుతుంది ? పార్లమెంట్ సెషన్స్‌ను మనము T. V. లో చూస్తున్నాము ! లోక్‌సభ, రాజ్యసభలలో- ఎంత గలాభ జరుగుతూ వున్నది. ఒకరు చెప్పేది- మరొకరు ఎవరు- వినిపించుకోరు. ఎవరి ధోరణి- వారిదే ! "అదొక ఫిష్ మార్కెట్టా ?" అను అనుమానం సామాన్యులమైన మనకే అనిపిస్తుంది. ఒక డిగ్నిటీని మెంటైన్ చేయరు. పైగా... ఆ గోలనంతా T. V. ద్వారా దేశ ప్రజలకు చూపుతారు. దీని నుండి "యువకులను ఏమి నేర్చుకోమని ?" ఏమి తెలిసికోమని ??" పార్లమెంట్‌లోని లోక్‌సభ, రాజ్యసభలే ఆ విధముగా వుంటే... మిగత సభలలో గోల ఎందుకు కాదు ?

## ధనార్జన చేయువారికి - ఉండవలసినది

మనలో ఆలోచన వున్నప్పటికీ... 'ఓర్పు' తక్కువ ! మనిషి పైకి రావాలంటే... ఓర్పు, నేర్పు వుండాలి. డబ్బు సంపాదించుటకు... తెలివి తేటలతోపాటు- నేర్పు, ఓర్పు అవసరము ! నిజాయితీ వుండాలి. నమ్మకము వుండాలి. నమ్రత వుండాలి. ఎవరిని తూలనాడుతూ మాట్లాడకూడదు... ఇవి ఎన్నో అపార్థములకు దారితీస్తాయి. ప్రతి నిమిషము చాల విలువైనది. కాలమునకు- కళ్ళెము వేయాలి. ఒక పథకము ప్రకారము ఒక టైమ్ టేబిల్‌ను ఏర్పరచుకుని కార్యక్రమమును నిర్వర్తించాలి. ప్రతి పనికీ

కాలపరిమితిని ఏర్పఱచుకోవాలి. అనుకున్న సమయములోనే... అనుకున్న పనిని- అనుకున్న రీతిగా నెఱవేర్చాలి. కాలతీతము చేయకూడదు. ఈరోజు చేయవలసిన పనిని ఈరోజే చేయాలి. "రేపు చేద్దాములే" అని అనుకో కూడదు. రేపులో ఎన్నో అవాంతరములు కలుగుటకు అవకాశము వున్నది. రేపు మనము వుండకపోవచ్చు. జరుపుతున్న పనికి అనుకూల వాతావరణము, పరిస్థితులు వుండకపోవచ్చు. "రేపు" అన్నది అనిశ్చితము !" "నేడు" అన్నది నిశ్చితము ! మీ నిత్యజీవితములో ఆనంద పుష్పములను పూయించండి ! డబ్బు సంపాదించుట ఒక వంతు ! దానిని సద్వినియోగము చేయుట మరో వంతు.

# భాగ్యము - ఆరోగ్యము

లక్షలు సంపాదించినా.... అనారోగ్యము వలన బాధలు పడుతూ వుంటే.... జీవితములో ఆనంద మేముంటుంది. "ఆరోగ్యమే మహా భాగ్యము" అన్నారు. ఎంత డబ్బుంటే మాత్రము ఏమి లాభము ? అనుభవించుటకు ఆరోగ్యము లేకపోతే ?

మీ రెక్కడుంటే.... మీ ఆరోగ్యము కూడా అక్కడే వుంటుంది. మీ ఆనందం కూడా అక్కడే వుంటుంది.

"ఒక గంట ఆనందముగా గడపాలంటే.... విందుకెళ్ళండి ! ఒకరోజు ఆనందముగా గడపాలంటే.... పెళ్ళి చేసికోండి !! జీవితాంతము ఆనందముగా గడపాలంటే.... మొక్కలకు సేవచేయండి !!!" అన్నాడు- చైనీస్ కవియైన- 'లిన్-యుటాంగ్.'

మొక్కలపైన మక్కువ వున్నా.... వాటిని పెంచుటకు చోటు లేదు. ఏ మాత్రము చోటున్నా.... అక్కడ ఒక చిన్న భవంతి ఉద్భవిస్తూ వున్నది. జనాభా కోట్లు కొద్దీ పెరిగి పోతూవుంటే.... మొక్కలు పెంచుటకు చోటు ఎక్కడ నుండి వస్తుంది ? మీ ఆరోగ్యమును మెఱుగు పఱచేవి- యంత్రములుకావు, ఫ్యాక్టరీలు కావు, కర్మాగారములు కావు. పచ్చటి పొలములు, పారేనదులు, వృక్షసంపద ! ప్రతివారు తమ ఇంటి

ముందొక బృందావనమును ఏర్పాటు చేసుకుంటే.... జీవితమంతా ఆనంద మయముగా గడుపవచ్చు. దీనివలన మనకు స్వచ్ఛమైన గాలి లభిస్తుంది. నిర్మలమైన నీరు లభిస్తుంది. వాతావరణ కాలుష్యము వుండదు. ఆరోగ్యము బాగుంటుంది. ఆనందమయ జీవితమును గడుపుతారు. మీరు చిరకాలము ఆనందముగా ఆరోగ్యముగా వుంటారు. మీ సంతతికి కూడా ఈ భాగ్యము కలుగుతుంది. కాబట్టి.... మీకు డబ్బుతోపాటు ఆనందము కూడా ఉండాలి. అదే జీవన రహస్యం !

## ధనార్జనలో - సుఖమున్నదా ?

మనము డబ్బు సంపాదిస్తున్నాము! డబ్బులో సుఖము వుంటుందా? "ఒకడు : ఉంటుంది. డబ్బు లేకపోతే.... జీవితమే దుర్భరము! డబ్బులేని వాడిని ప్రపంచము గౌరవించదు. వాడిని అంటరానివాడుగా చూస్తుంది. డబ్బుంటే.... అన్నీ వుంటాయి. డబ్బు లేకపోతే.... ఏమీ వుండవు. జీవితము దుర్భరమై పోతుంది. మన బంధువులు, మన స్నేహితులు మనలను విడిచిపెడతారు. మనలను గురించి ససేమిరా ఆలోచించరు. ఒక పురుగులా చూస్తారు. కనుక జీవితమునకు డబ్బే ప్రాణము! డబ్బే సర్వస్వము !! డబ్బుంటే దేవేంద్ర భోగములను అనుభవించవచ్చు" అన్నాడు.

ఇంకొకడు : "అలాగా? డబ్బుంటే సుఖము వుంటుందా? ఎవరన్నారా మాట ? లక్షాధికారులంతా సుఖముగా వుంటున్నారా ? వారికి సమస్యలే లేవా ? అనారోగ్యము వారి దరి చేరదా ? ఆస్పత్రులకు వారు ఎంతదూరములో వుంటారో చెప్పండి ! మాట్లాడరేమిటి ? ధనికులు పడే మానసిక వ్యథ ఏమిటో మీకేమి తెలుసు ? మనస్సు ప్రశాంతముగా వుండదు. ఆరోగ్యము వుండదు ఇన్‌కంటాక్స్‌ల బెడద, అందువలన బెంగ ! కాబట్టి .. డబ్బువున్నంతమాత్రాన అన్నీ వుంటాయని భావించుట అనుచితము, అవివేకము !" అన్నాడు.

పైన చెప్పిన రెండు విషయములలోనూ లోపమున్నది.

# కర్తవ్యపాలన

చేసేపని "పెద్దదా ? చిన్నదా ?" అని విశ్లేషించకండి ! ఈ విషయమునే-సోమర్‌సెట్ మామ్ తన గ్రంథములో 'మదర్ సుపీరియర్' చేత 'కిట్ ఫే'కు ఇలా సలహా యిస్తాడు. "నీ కర్తవ్యమును- నీవు నిర్వర్తించుట గొప్పకాదు. అది నీ విధి! నీ చేతులు మురికిగా వుంటే... చేతులు కడుక్కో- కడుక్కున్నట్లే! అందులో విశేషము ఏముంది? నువ్వు చేయవలసిన పని మీద ఏ మేరకు శ్రద్ధ చూపుతున్నావు? ఆసక్తిని చూపుతున్నావు? ప్రేమగా ఆ పనిని చెయ్యగలుగుతున్నావా? లేక తప్పనిసరియై చేస్తున్నావా? అనేది ముఖ్యము! నువ్వు నీ పనిమీద ప్రేమ, శ్రద్ధ, భక్తి, ఆసక్తి చూపితే.... ఆ పని అద్వితీయమైన విజయమును సాధించి తీరుతుంది. దానికి తిరుగు లేదు."

కర్తవ్యపాలన వలన- నీకు ఆనందము, సుఖము, సంతృప్తి కలుగుతాయి. నీకిచ్చిన పనిని సంపూర్ణముగా, సంతృప్తికరముగా నెఱవేర్చిన ఆనందము నీకు కలుగుతుంది. ఆ పనిని నీ యజమానితోపాటు ప్రజలు కూడా మెచ్చుతారు.

# తుది నిర్ణయము నీదే !

నువ్వు జీవితములో ఏమి కావాలనుకుంటున్నావో.... దానిని నిర్ణయించుకోవాలి. ఇతరులు నిర్ణయించలేరు. నీ సామర్థ్యము నీకు తెలుసు! ఇతరుల మీద నీ భవిష్యత్తు కొరకు పూర్తిగా ఆధారపడుట అవివేకము! సలహాలు ఎన్నైనా తీసికో! కానీ.... తుది నిర్ణయము మాత్రము నీదే! అదీ దృఢనిర్ణయము కావాలి. తీసుకున్న నిర్ణయములో నువ్వు ఫెయిల్ ఐతే.... దానికి ఇతరులను ఎంతమాత్రము బ్లేమ్ చేయకు ! దానికి పూర్తి బాధ్యత నీదే! ఇతరులను నిందించుట నీ బలహీనతను సూచిస్తుంది. ఏ ఊరు వెళ్ళాలో నిర్ణయము లేకుండా "బుకింగ్‌క్లార్క్ టికెట్ ఇవ్వలేద"ని అత

నిని నిందించుట తప్పు! నువ్వు ముందుగా వెళ్ళదలచిన ఊరును తేల్చుకోకుండా.... బుకింగ్‌క్లార్క్‌ను నిందిస్తావే? అతడు నువ్వు ఏ ఊరికి టిక్కెట్ అడిగితే.... ఆ ఊరికే టిక్కెట్ ఇస్తాడు. మధ్యలో అతని అభ్యంతర మేమి వుంటుంది? నీ బాధ్యతను ముందుగా నీవు నిర్వర్తిస్తే... తరువాత ఇతరులు వారి బాధ్యతలను నిర్వర్తిస్తారు. అంటే.... నువ్వు ఏ ఊరు వెళుతున్నదీ అతనికి చెప్పు! అతను తెలియజేసిన టిక్కెట్ ఖరీదును ఇస్తే... బుక్కింగ్ క్లార్క్ టిక్కెట్ ఇస్తాడు. "నీ దగ్గర ఎంత డబ్బు వున్నదా?" అనికాదు ప్రశ్న! "వెళ్ళవలసిన ఊరు ఏది?" అన్నది ప్రశ్న! డబ్బు ఒక్కటే మీ సమస్యలను పరిష్కరించదు. అందుకు మీ తెలివి-తేటలు కూడా జోడించాలి. ప్రతీ సమస్యకు "ప్రాక్టికల్ అప్రోచ్" అంటూ ఒకటి వుంటుంది బుద్ధి బలముతోపాటు, ఆత్మస్థైర్యము కూడా వుండాలి.

**స్వయం ప్రతిపత్తి అలవడాలి :** మనలో చాల మంది విద్యావంతులు- ఉద్యోగములు లేక అలమటిస్తున్నారు. "ఎప్పుడూ.... ఎవరి క్రిందో పనిచేయాల"ని అనుకుంటూ వుంటారు. వారంతట వారు "తమ కాళ్ళమీద నిలబడి, జీవించాల"ని అనుకోరు. వారికి "ఇండిపెండెంట్‌గా బ్రతకాల"ని వుండదు. అది వారికి చిన్నప్పటి నుండి ఇవ్వబడిన ట్రైనింగ్ మహాత్మ్యము!

నిరుద్యోగులైన నలుగురూ స్వయంప్రతిపత్తితో ఒక ఇండస్ట్రీని స్థాపించి, బ్యాంక్ లోన్సు పొంది, సమిష్టి కృషితో వ్యాపారము చేయాలనీ," మనక్రింద "మరో పదిమంది పోషించబడాల"ని ఎందుకు ఆలోచించరు? ప్రతి వ్యక్తీ ఒక ప్రత్యేకతను సంతరించుకోవాలి. అప్పుడే... ఆ వ్యక్తి ఘనత బయటపడుతుంది.

కాలేజ్ చదువులు మాత్రమే జీవించుటకు సరిపోవు. వాటితోపాటు కామన్ సెన్స్ దండిగా వుండాలి. అన్నింటికీ మించి 'ఎక్స్‌పర్ట్' వుండాలి.

షేక్స్పియర్ మహాకవి తాను రచించిన ప్రఖ్యాత విషాదాంత నాట

తన 'జూలియస్ సీజర్'లో- "కొన్ని సమయాలలో మానవుడు 'విధి'ని జయించగలడు బ్రూటస్! మన తప్పులను- మనమే గ్రహములకు ఆపాదించుట అవివేకము! అది మన అసమర్థతకు నిదర్శనము" అని పేర్కొన్నారు.

విజయము సాధించినప్పుడు విజయోత్సాహము కలుగుట సమంజసము! ఎవరి జీవితము మీద వారి దృక్పథము పనిచేస్తూనే వుంటుంది. అది అనివార్యము!

లక్ష్యము వుండాలి : మనలో ప్రతివారూ ఒక 'కొలంబస్' లేక ఒక 'గెలీలియో' లేదా 'ఐన్‌స్టీన్' వలె కాలే! అలాగే.... మహాకవి 'బెర్నార్డ్‌షా' కాలే. ఇలాగే అందఱమూ చంద్రమండలమునకు వెళ్ళలేము. కానీ.... జీవితములో ఏదో ఒకటి సాధించాల"నుకొనుట నేరము కాదు. "ఆకాశానికి గురిపెట్టు! కనీసము చెట్టునైనా కొట్టగలుగుతావు" అన్నారు శామ్యూల్ స్మైల్స్!

ధ్యేయము వుండాలి : మహాకవి 'శ్రీశ్రీ' తన కావ్యంలో.... "నేను సైతం ప్రపంచాగ్నికి- సమిధ నొక్కటి ఆహుతిచ్చాన్" అని గర్వముగా చెప్పుకున్నాడు. ప్రతీ వ్యక్తి ధోరణి ఇదే విధముగా వుండాలి. నేను ప్రపంచమునకు ఏదో ఒక మంచి పనిని చేయాలి" అని అనుకోవాలి. ఇది ప్రతి ఆదర్శమానవుని ధ్యేయము! కావాలి.

శాంతి కావాలి : ఇతరులను దుఃఖపెడుతూ.... తాము ఆనందించకూడదు మనిషిని- మనిషి గౌరవించాలి. సానుభూతితో ప్రతీ విషయమును పరిశీలించాలి. సామరస్యత, సహజీవనములను అలవఱచుకోవాలి. సదవగాహనను పెంపొందించుకోవాలి. ఈ సూత్రములను పాటిస్తే.... ప్రపంచములో ఎక్కడా అశాంతి వుండదు. ఇలా సౌభ్రాతృత్వము వర్ధిల్లాలి ప్రపంచ దేశములను కలిపేది శాంతి సందేశము! ఆ శాంతి పావురము- తుపాకి మొననుండి వెలువడే తెల్లని పొగ రూపముగా వుండే పావురము కాకూడదు. అది శ్వేత పావురమై వుండాలి. అది

స్వేచ్ఛా పావురము అయి వుండాలి. ఈనాడు దాని రెక్కలను విఱచి కట్టుటకు ప్రయత్నములు జరుగుతున్నాయి. విశ్వశ్రేయస్సుకు విషమ పరీక్ష అవుతుంది. పరమ విఘాతము అవుతుంది. దానిని గుర్తించి, ప్రపంచ దేశములన్నీ శాంతికాముక దేశములుగా మారాలి.

'డబ్బు' సాధించలేని ప్రగతిని- 'శాంతి' నినాదము సాధించగలుగుతుంది. ప్రపంచమును పరిపాలించేది- 'డబ్బు' అయినా.... అదే సర్వస్వము కాదని... కాకూడదని... మనమంతా గ్రహించిననాడు విశ్వశాంతి నెలకొంటుంది.

## జయము-అపజయము

నువ్వు జీవితములో అనుకున్న పనిని సాధించలేక పోవుటకుగల కారణములను గురించి ఎప్పుడైనా ఆలోచించావా ?

జీవితములో అతి పెద్ద ట్రాజడీ ఏమిటో తెలుసా? చాలమంది 'సిన్సియర్'గా ప్రయత్నించి కూడా ఫెయిల్ అగుట ! అందరూ ప్రయత్నము చేస్తారు. కానీ... కొందఱు మాత్రమే విజయమును సాధించ గలుగుతారు. నేను నా జీవితములో ఎందఱినో... చూచాను. కష్టపడతారు గానీ... ఫలితమును పొందలేరు. ఓడిపోయేవారే 98% వుంటే... ఇద్దరు మాత్రమే విజయమును సాధిస్తున్నారు. "కారణము ఏమిటి" అని ఆలోచించాను ! పరిశీలించాను !! పరిశోధించాను !!! కారణము కనుక్కొన్నాను

ఫెయిల్యూర్‌కు- మనలో- 31 మేజర్ కారణములు కనిపించాయి.

విజయము పొందుటకు- 13 మేజర్ కారణములు కనిపించాయి.

## అపజయమునకు 31 కారణములు

మీకు- ఫెయిల్యూర్‌కు గల కారణములను ఒక్కొక్కటిగా వివరిస్తాను. వాటితో మీరు- మీరనుకున్న కారణములను పోల్చి చూడండి ! మీకే తెలుస్తుంది... విజయమునకు- అపజయమునకు మధ్య ఎంత అంతరము వున్నదో ?

1] అనుకూలముకాని కుటుంబ పరిస్థితులు : మనిషికి పరిస్థితులు అనుకూలించకపోతే... చేసేదేమీలేదు. అతనికి తగినంత తెలివి-తేటలు వుండాలి. లేకపోతే మాస్టర్ మైండ్ వున్నవారిని సంప్రదించాలి.

2] జీవితములో నిర్దిష్టమైన ఆశయము లేకపోవుట : జీవితములో ఏదో ఒక ఆశయము లేకపోతే... మానవు డేదీ సాధించలేడు. నూటికి 98 మందికి- "జీవితాశయమం"టూ ఏదీ వుండదు. బహుశః వారి అపజయములకు అదే కారణమై వుండవచ్చు.

3] తనకు మించి ఆలోచించ లేకపోవుట : "జీవితములో ముందుకు పోవాల"నే ఆశ, ఆశయము లేకపోతే.... ఎవరు మాత్రము ఏమి చేయగలరు ? తగిన మూల్యము చెల్లించక తప్పదు.

4] తగినంత చదువు-సంస్కారము లేకపోవుట : తగినంత చదువు లేకపోవుట- అభివృద్ధి కుంటుబడుటకు ఒక ముఖ్య కారణము ! బాగా చదువుకున్న వారిని చూడండి ! చదువు+స్వయం కృషితో- పైకి వచ్చినవారు కనిపిస్తారు. కాలేజ్‌లో డిగ్రీలు పొందినంత మాత్రము చేతనే వారు విద్యావంతులైపోరు. జీవితములో బ్రతకుట కూడా తెలియాలి. తెలివి-తేటలు చదువుతో మెరుగు పడతాయేమోగాని.... ఒరిజనల్‌గా పుట్టుకురావు. పెద్ద పెద్ద జీతాలిచ్చి ఎందుకు ఉద్యోగాలలో పెట్టుకుంటారు ? "వారికి పెద్ద చదువు వున్నద"ని కాదు.... ఆ చదువు సహాయముతో వారికి కావలసిన పనిని విజయవంతముగా చేయగలుగుతూ వున్నందుకు !

5] సెల్ఫ్ డిసిప్లైన్ (స్వశిక్షణ) లేకపోవుట : 'స్వశిక్షణ (సెల్ఫ్ డిసిప్లేన్)'-సెల్ఫ్ కంట్రోల్‌తో అలవడుతుంది. అంటే.... ప్రతి వ్యక్తి తనలో చెలరేగే నెగిటివ్ క్వాలిటీస్‌ను కంట్రోలు చేయగలిగి వుండాలి. మీరు కండిషన్స్‌ను కంట్రోల్ చేసే ముందు- మిమ్ములను మీరు కంట్రోల్ చేసికోండి ! మిమ్ము మీరు జయించుకోండి ! ఇదే చాల కష్టము!

మిమ్మ మీరు జయించుకోకపోతే... మీరు మీ చేతిలోనే ఓడిపోతారు. మీరు శత్రువును, మిత్రుడను ఒకే కోణము నుండి చూడగలగాలి. అదే జీవిత దర్పణము !

6] అస్వస్థత : మీ ఆరోగ్యము బాగా లేకపోతే ... మీరేమీ చేయలేరు. మీ విజయమునకు మూలస్తంభము మీ ఆరోగ్యము ! అది కుంటుపడితే.... మీరేమీ చేయలేరు.

"శరీర మాద్యము ఖలుధర్మ సాధనమ్" అన్నారు. ఏ పని చేయాలన్నా.... ఆరోగ్యము బాగుండాలి. అనారోగ్యములకు కారణము మీ అనాలోచన మరియు మీమీద మీకు కంట్రోల్ లేకపోవుట ! కొన్ని అనారోగ్య కారణములను ఈ క్రింద చూడండి !

a) అతి ఆహార భక్షణ :- ఆరోగ్యమునకు- హానికరమైన ఆహారము ను అతిగా తినుట !

b) చెడు ఆలోచనలు :- నెగిటివ్ ఆలోచనలకు ప్రాధాన్యత నిచ్చుట !

c) సెక్స్‌కు హెచ్చుగా ప్రాధాన్యత నిస్తూ.... ఆరోగ్యమును పాడు చేసికొనుట !

d) తగినంత శారీరక వ్యాయామము చేయక పోవుట !

e) వాతావరణ కాలుష్యము వలన- మంచి గాలిని పీల్చలేకపోవుట!

7] పసితనములో- పెరిగిన వాతావరణము ఆరోగ్యకరమైనది కాకపోవుట : "మొక్కై వంగనిది- మానై వంగుతుందా ?" అన్నట్లు పసితనములోనే వాతావరణ కాలుష్యము వుంటే.... పెరిగి పెద్దయ్యాక దాని ప్రభావము వ్యక్తిమీద బాగా వుండి తీరుతుంది. చాలమందికి పసితనములో వారు పెరిగిన వాతావరణమునుబట్టి.... వారిలో 'క్రిమినల్ టెండెన్సీస్' గోచరిస్తూ వుంటాయి.

8] జాప్యము చేసే అలవాటుండుట : కొందరికి- ఏ పనీ తొందరగా చేయాలనే ధోరణి వుండదు. జాప్యము చేస్తూ వుంటారు.

"రేపు చేద్దాములే! రేపు ఇంతకంటే బాగుగా చేయొచ్చు" అన్న ఆలోచన మంచిది కాదు. చాలమంది అపజయము పొందుటకు మూలకారణము ఇదే! అలసత్వ ధోరణి, జాప్యము చేసే మన తత్వము, "మంచి ముహూర్తము చూచి చేద్దాములే" అను కారణము. తద్వారా మంచి సదవకాశములను పోగొట్టుకొంటారు. జీవితములోని అపజయములకు- "అలసత్వము, జాప్యము" అనునవి రెండు కారణములు! మీరు పనులందు ఆలశ్యము చేయకండి! మీకు ఆలోచన గలిగడమే "మంచి ముహూర్తమ"ని భావించండి! వెంటనే ఆలశ్యము చేయకుండా ఆరంభించండి!! విజయమును సాధించండి! మరుక్షణము మనది కాదు. అది మన ఆధీనములో వుండదు. క్రియలోకి దిగడమే తక్షణ కర్తవ్యము! ఉన్నచోట వున్న ఫళముగా, వున్న క్షణములో, వున్న సామాగ్రితో వెంటనే మీ సంకల్పమునకు రూపకల్పన చేయండి! కాలయాపన చేయకండి!

**9]** పట్టుదల లేకపోవుట : అందరూ సక్రమముగానే ప్రారంభిస్తారు. కానీ.... దానిని పట్టుదలతో కొనసాగించలేరు. పట్టుదలతో కొనసాగించకపోతే.... ప్రారంభించడమే వ్యర్థము! మనలో చాలమంది బ్రహ్మాండముగా ఆరంభిస్తారు గానీ కొనసాగించరు. ఈ విషయమే తరువాత పట్టించుకోరు. "పని ఏమైనదో"నన్న ఆలోచనే వారికి వుండదు. చాలమంది ప్రారంభిస్తారు. తరువాత ఏదైనా స్వల్ప మాత్రపు అడ్డంకు కలిగి, కొద్ది అపజయము ఎదురైతే.... దానిని తిరిగి కొనసాగించరు. మధ్యలోనే తాము ప్రారంభించిన కార్యమును పరిసమాప్తం చేస్తారు. 'పట్టుదల'కు మరో 'పదం'లేదు. దాని విశిష్టతకు వేరే సమయము లేదు. 'పట్టుదల'కు 'అపజయము'పరమ శత్రువు!

**10]** నెగిటివ్ పర్సనాలిటి : కొందరు సహజముగా జీవితములో 'నెగిటివ్ పర్సనాలిటీ'ని- డెవలప్ చేసికొంటారు. ఇది అన్ని విధములా అనర్థమును చేకూర్చుతుంది. అంటే... ప్రతీవ్యక్తినీ భేదబుద్ధితో చూచుట, విమర్శనా దృష్టితో పలకరించుట మంచిది కాదు. ఏ వ్యక్తినీ

విమర్శించకూడదు. విజయము సాధించు వ్యక్తి శక్తి తోడ్పడాలి. ఆ శక్తి పదిమంది నుండీ సమకూడుతుంది. అందుకే "పదిమందితో మంచిగా వుండాలి" అని అంటారు. నెగిటివ్ పర్సనాలిటీ వున్నవారి దగ్గఱకు ఎవ్వరూ చేరరు.

11] 'సెక్సువల్ అర్జ్'ను కంట్రోల్ చేసికోలేకపోవుట : మనలోని శక్తి కంతటికీ మూలము- మన సెక్సువల్ పవర్ ! దీనిని కంట్రోల్ చేసికోగలిగితే.... మనకు 'పవర్' కంట్రోల్‌లో వుంటుంది. మనలోని స్పందన అన్నింటిలో శక్తివంతమైన స్పందన సెక్సే ! ఈ స్పందన కలిగినప్పుడు దీనిని మనము కంట్రోల్ చేయగలగాలి.

12] యధేచ్ఛగా ప్రవర్తించుట : "గేంబ్లింగ్" అనే వ్యసనము మనిషిని మృగముగా మారుస్తుంది. "గేంబ్లింగ్" అతి కొద్ది పెట్టుబడితో- అత్యంత విలువైన ప్రతిఫలమును, అతి సులభముగా పొందాలనే కోరిక ! ఇది మానవుని పతనమునకు దారితీస్తుంది.

13] నిర్ణయము తీసుకునే శక్తి లేకపోవుట : విజయము సాధించే వ్యక్తులు మంచి నిర్ణయములను తీసికోగలుగుతారు. ఒకవేళ నిర్ణయములను మార్చుకోవాలనుకున్నా.... నెమ్మదిగా మార్చుకొంటారు గానీ.... వెంటనే మార్చరు. జీవితములో విజయము సాధించలేనివారు వారు తరచు తమ నిర్ణయములను మారుస్తుంటారు. వారికి నిలకడంటూ వుండదు. వాయిదా వేయుట, నిర్ణయించుకునే శక్తి లేకపోవుట ఘనవిజయమునకు అవరోధము ! ఒకటి వున్నచోట మరొకటి తప్పక వుంటుంది.

14] ఒకటిగాని అంతకన్నా ఎక్కువగాని వుండే బేసిక్ ఫియర్స్ : కనీసము ఒక ప్రాథమిక భయమునైనా లేని [illegible] కూడదు

15] పెళ్ళిలో సరిపడని వారిని. భార్యగానో, భర్తగానో పొందుట, అపజయమునకు ముఖ్య కారణము : భార్యాభర్తల అన్యోన్యత మీద- జీవితముయొక్క విజయము ఆధారపడి వుంటుంది. భార్య భర్తలు ఎల్లప్పుడు పోట్లాడుకుంటూ వుంటే.... వారు జీవితములో ఏమీ సాధించలేరు వారి సంతానము కూడా ఎదుగుదలా కొరగాకుండాపోతుంది. వారి జీవితములు దుర్భరమౌతాయి.

16] అతి జాగ్రత్త : అతి జాగ్రత్తను పాటించుట కూడా అపజయములకు కారణమౌతూ వుంటుంది. అజాగ్రత్త- ఎలాగో.... అతి జాగ్రత్త కూడా అంతే! అతి ఎల్లప్పుడూ మంచిదికాదు. "జీవితము" అనేదే 'ఛాన్స్' మీద ఆధారపడి వుంటుంది.

17] వ్యాపార భాగస్థుల ఎంపికలో పొరబాటు పడుట : వ్యాపారములో నష్టపోవుటకు ప్రబల కారణము- మనతోటి పార్ట్‌నర్స్ సరైనవారు కాకపోవుట ! మన దగ్గర పనిచేసే వారినికూడా మంచి అనుభవజ్ఞులను పెట్టుకోవాలి. సంఘమానికూడా ఆదర్శప్రాయుడుగా వుండేవాడే అయివుండాలి

18] మూఢనమ్మకములు : ఈర్ష్య, ద్వేషము వున్నవారు: మూఢ విశ్వాసములున్నవారు వ్యాపారములో పార్ట్‌నర్స్‌గా పనికిరారు. "మూఢ నమ్మకము" అంటే అదికూడా ఒక రకమైన భయమే! తెలివి తక్కువతనమే !! విజయము సాధించే వారెప్పుడూ ఎవరికీ తలవంచరు. ధైర్యవంతులు. విశ్వాసపాత్రులై వుంటారు.

19] చేపట్టు పనియందు తగు జాగ్రత్త లేకపోవుట : చేపట్టదలచుకున్న పనిని కాని, చేబట్టదలచుకున్న వృత్తిని కాని ఎన్నుకునే ముందు తగు జాగ్రత్తలను తీసికోవాలి. తరువాత పశ్చాత్తాపపడి, బాధపడి లాభములేదు.

20] ఏకాగ్రత లోపించుట : అన్నింటిలోను, వేలుపెట్టిన వాడు- దేనికోనూ నిభాయించలేడు. ఏదో ఒక పనిమీద ఏకాగ్రత వుండాలి.

21] దుబారా ఖర్చులు చేయుట : దుబారాగా ఖర్చు చేసే వాడు ఏ రకమైన వ్యాపారములోనూ ఇమడలేడు. పైగా నష్టపోతాడు. 'మనీ' వ్యవహారములో కచ్చితముగా వుండాలి. బేరము చేయగలగాలి. ఇబ్బందులను సరిపుచ్చుకొని వెళ్ళేట్లు ఉండాలి.

22] చేసేపని మీద ఉత్సాహము లేకపోవుట : ఉత్సాహము లేకపోతే.... ఏ పనీ చేయలేరు. నిరుత్సాహముగా చేసే పనికి ఫలితము కూడా నిరుత్సాహ జనకముగా వుంటుంది. ఉత్సాహము ఒక అంటువ్యాధి లాంటిది. అది ఒకరి దగ్గరనుండి మరొకరికి వ్యాపిస్తూ వుంటుంది.

23] అసహనము : అసహనము వున్న వ్యక్తి ఏ వృత్తికీ పనికిరాడు. అసహనము వున్నదంటే.... ఆ వ్యక్తి మరి ఇక ముందు దేనికీ పనికిరాదన్నమాట ! అసహనము ఎక్కువగా మత వ్యవహారముల లోను, వర్గ వ్యవహారములలోను, రాజకీయ వ్యవహారములలోను హెచ్చుగా కనిపిస్తూ వుంటుంది.

24] 'బాడ్ టెంపర్‌మెంట్'ను కలిగి వుండుట : ఇది హెచ్చుగా తిండి విషయములో, త్రాగుడు విషయములో, లైంగిక విషయములో వుంటుంది. ఈ విషయములలో అధికముగా ప్రవర్తిస్తే.... నష్టము మాత్రము వారిదే !

25] ఇతరులతో కలసి మెలసి - వుండలేక పోవుట : చాలమంది తమకున్న గొప్ప అవకాశములను పోగొట్టుకొనుటకు అందరితో కలసి-మెలసి వుండలేకపోవడమే కారణము ! అన్ని కారణముల కన్నా ఈ కారణము అపజయము కలుగుటకు మూలము !

26] స్వయంకృషితో సంపాదించిన పదవి కానప్పుడు: అంటే ఎవరి ప్రాబల్యము చేతో వచ్చిన పదవిని ఉంచుకొనుట వలన పదవిలో విజయము సాధించలేడు ఉదాహరణకు ధనవంతుల కొడుకులు,

వారసులైన డబ్బును సంపాదించుటకు ఏమాత్రము కష్టపడనక్కరలేదు. వారి తండ్రీ, తాతలు సంపాదించి ఇచ్చి యున్నారు. కాబట్టి.... వీరికి "డబ్బును సంపాదించాలి"నే బాధ లేదు. అలాగే.... బీదరకమైన ఫరవాలేదు గానీ... మధ్యంతరముగా వచ్చిన ఐశ్వర్యం చాల చెడ్డది. 'నడమంత్రపు సిరి' బహు ప్రమాదకారి!

27] అవినీతిగా ప్రవర్తించుట : నీతిని మించినది లేదు. "నీతి" అన్నది వ్యాపారములో గాని, ఉద్యోగములో గాని, అసలు ఏ కార్యక్రమమునకు గాని అతి ముఖ్యము! ఎవరైనా దురదృష్టవశాత్తు ప్రమాదము వలన అవినీతికి పాల్పడవచ్చు. దానివలన శాశ్వత నష్టము కలుగక పోవచ్చు. "కావాల"ని అవినీతికి దిగితే.... క్షంతవ్యము కాదు. ఏదో ఒక రోజు అతని అవినీతి బట్టబయలు కాక తప్పదు. అతనికి పరువు పోక తప్పదు.

28] గర్వము, అహంకారము : ఏ వ్యక్తికీ గర్వముగాని, అహంకారముగాని వుండరాదు. విజయమునకు అవి అవరోధములు! గర్వము, అహంకారములను విడనాడాలి.

29] ఆలోచించాలిగానీ,..... ఊహించకూడదు : చాలమంది విషయములను ఆలోచించరు. ఊహించుకుంటూ వుంటారు. ఊహలు యదార్థములు కావు. వీటివలన కొన్ని ఇబ్బందులు ఉద్భవిస్తాయి. ఆ కారణాన విజయము సాధించలేరు. ఊహాగానములను చేసికొని కార్యక్రమములను రూపొందిస్తారు. అది చాల తప్పు!

30] మూలధనము లేకపోవుట : ఏ కార్యక్రమము చేపట్టాలన్నా.... ముందుగా మూలధనమును చూచుకోవాలి. డబ్బులేనిదే ఏ పనీ జరుగదు.

31] ఇతర కారణములు : అగ్నిప్రమాదము, వరద తీవ్రత్వము ఇట్టి కారణములుకాక ... అపజయమునకు కారణభూతమైన మరే కారణమున్నా.... అదికూడా ఇందులో కలిసి వుంటాయి.

పైన చెప్పిన కారణముల మూలముగా మనము ఏ వ్యాపారములో నైనా అపజయము పొందితే.... బాధపడుట వ్యర్థము!

## మీరు- మీరేమిటో మీకు తెలుసా ?

మనలను- ఇతరులు గమనించినట్లుగా.... మనలను మనము చూచు కోలేము. ఇది సహజము! ఇతరులు మనలను గురించి క్షుణ్ణముగా అవ గాహన చేసికోగలరు. మీ గురించి మీకు తెలియకపోవచ్చు. కాని ఇతరు లకు బాగా తెలుస్తుంది.

ముందు మీ గురించి మీరు తెలిసికోండి! వ్యాపారము చేయా లంటే.... మీరు వ్యాపారమును గురించి ముందుగా తెలుసుకుని వుండాలి. అదే విధముగా 'పర్సనల్ సర్వీసెస్'ను మార్కెటింగ్ చేయుటకు ముందుగా.... మీరేమిటో, మీకా పనిలో ఎంత నైపుణ్యము వున్నదో తెలిసికొనుట అవసరము! "మీ వీక్నెస్ ఏమిటో" ముందుగా మీరు తెలిసి కోవాలి. అప్పుడే ఆ వీక్నెస్‌ను అధిగమించుటకు మీరు తగిన ప్రయ త్నము చేస్తారు. అలాగే మీ 'స్ట్రాంగ్ పాయింట్స్' కూడా మీరు తెలిసి కోవాలి. తెలిస్తే.... మీ బలమును ఉపయోగించగలుగుతారు. దీనికి మిమ్మ మీరు బాగా విశ్లేషించుకోవాలి. దీనిని "సెల్ఫ్ ఎనాలిసిస్" అంటారు.

ఒకసారి ఒక యువకుడు ఒక వ్యాపారసంస్థలోని ఉద్యోగ ఇంట ర్వ్యూకి వెళ్ళాడు. అక్కడ ఇంటర్వ్యూ బాగానే చేసాడు. వారతనిని "నీకెంత జీతము కావాలని" ప్రశ్నించారు. అప్పుడు తను "నేనేమి అనుకో లేదు. మీ రెంత ఇవ్వదలచుకుంటే.... అంతే ఇవ్వండి!" అన్నాడు. అప్పుడు ఆ సంస్థ మేనేజర్ - మీరు ఒక వారము రోజులు పనిచేసిన తరు వాత.... మీ పనితీరును బట్టి మీ జీతమును నిర్ణయిస్తామన్నారు. ఎందు చేతనంటే.... అతనికి స్వయముగా నిర్ణయించుకునేశక్తి లేకపోవడమే అందుకు కారణము! ఒక వారము పనిచేసాడు. వారు జీతమును నిర్ణయిం చారు. దీనికి అతను అంగీకరించలేదు. "నేను పనిచేసే దగ్గర ఇంతకంటే ఎక్కువే జీతము ఇస్తున్నారు" అన్నాడు.

మీరు ఒక ఉద్యోగము చేస్తూ.... "మరో ఉద్యోగములోకి మారాలి" అనుకున్నప్పుడు మీ టాలెంట్‌కు తగిన ప్రతిఫలము ముట్టినప్పుడు వెళ్ళుట మంచిదే! అంతకన్న ముందర వెళ్ళేముందు మీకు అవతలివారు "ఎంత జీతము ఇవ్వగలరో" తెలిసికొనుట మంచిది. మీరు.... ఎక్కువ జీతమును ఆశించుట మంచిదేగాని.... ఆ ఎక్కువ జీతమునకు మీకున్న అర్హత ఏమిటో తెలిసికొనుట మంచిది. చాలమందికి అవసరములు వుండవచ్చునుగాని.... ఆ అవసరములు తీర్చుటకు మీకున్న క్వాలిఫికేషన్స్‌ను కూడా చూచుకోవాలి. మీకున్న 'వర్త్'ను మించి మీ అవసరములున్నాయనుకోండి! అలాంటప్పుడు అటువంటి అవసరములు తీరే అవకాశము ఉండదని తెలిసికోవాలి.

మీవలన సంస్థకు గలిగే ప్రయోజనములను బట్టే.... వారు మీకిచ్చే జీతము ఆధారపడి వుంటుంది. చిన్న గుడ్డ తెచ్చి, పెద్దచొక్కా కావాలంటే జరగని పని! అదేవిధముగా జీవితములో మనము తరుచు చూస్తాము.... తెలివి తక్కువవాడి చేతిలోని ధనము చాల అనర్థములకు దారి తీస్తుంది. అది ఎంతో ప్రమాదకరమైనది. డబ్బు విలువ- దాని వినియోగముమీద ఆధారపడి వుంటుంది సంపాదించుట ఎంత కష్టమో.... దానిని సక్రమముగా వినియోగపరచుట కూడా అంతే కష్టము! అది అందరికీ సాధ్యముకాదు.

## సరైన నిర్ణయము

U.S.A.లో- ఒకసారి 25,000 మంది స్త్రీ, పురుషులను సర్వే (పరీక్ష)చేసి, వారి అపజయమునకు కారణములను అన్వేషించుట జర్గినది. దానిలో తేలిన విషయము ఏమిటంటే.... అందరి అపజయమునకు కారణము ఒక్కటే అని తేలిపోయినది. ఏమిటది? "సకాలములో సరియైన నిర్ణయము (డిసెషన్)ను తీసికోలేకపోవుట" అని తేలిపోయినది కనుక.... డెసెషన్ మేకింగ్ చాల ముఖ్యము !

ఏ నిర్ణయమును ఆలశ్యము చేయరాదు. వెంటనే నిర్ణయము తీసుకుని

2] నేను చేయదలచుకున్న రీతిలో- చేయదలచిన మేరకు నా సేవలను అందించగలిగానా ? లేక మరింత సమర్థవంతముగా సేవచేసి వుంటే బాగుండేదా ??"

3] "నేను చేసిన సేవ సరిపోతుందా ? లేక ఇంకా సేవ చేయవలసి వున్నదా ??"

4] "నేను చేసిన పనిని అందరూ హర్షించారా ? లేక విమర్శించారా ??"

5] "నేను చేసే పనిలో ఏదైనా ఆలశ్యము, జాప్యము జరిగినదా? అందువలన ఏమైనా లోపములు దొర్లాయా ??"

6] "ఈ పని చేయుటవలన నేను నా వ్యక్తిత్వమును పెంచుకున్నానా ? లేక వ్యక్తిత్వము తగ్గిపోయినదా ??"

7] "అనుకున్న ప్లాన్ ప్రకారమే నేను నా పనిని పూర్తిచేసానా?"

8] "నా నిర్ణయములన్నీ సరిగ్గా వున్నాయా ? తేడాలు ఏమైనా వచ్చాయా !?"

9] "నేను నా ఆరుగురు శత్రువుల భయముతో- నా కర్తవ్యమునందు లోపములను చేసానా ?"

10] "ఎప్పుడైనా నా పనిలో- అతి జాగ్రత్తలకుపోయి, చేయవలసిన పనిని సరిగ్గా చేయలేకపోయానా ?"

11] "నేను నా సహచరులకు- సంతృప్తికరముగా సహకరించగలిగానా ? వారికి నావలన ఏదైనా బాధ కలిగినదా ??"

12] "నా ఏకాగ్రత లోపించుటచేత.... నా పనిని సక్రమముగా చేయలేకపోయానా ?"

13] "అన్ని విషయములలో నేను బాహాటము (ఓపెన్ మైండెడ్)గా ప్రవర్తించానా ? లేక సంకుచిత స్వభావమును ప్రదర్శించానా ??"

14] "నేను ఈ పని చేయుటవలన ఏ విధముగా నా సేవలో అభివృద్ధిని సాధించగలిగాను ?"

15] "నా అలవాట్లలో- దోషము ఏమైనా వున్నదా? దానివలన నేను చేయవలసిన పనిని సక్రమముగా నిర్వర్తించలేదా ??"

16] "నేను అంతర్గతముగాగానీ, బాహాటముగాగానీ అహంభావమును ప్రదర్శించానా ?"

17] "నా ప్రవర్తన వలన నా సహచరులకు నాపై గౌరవభావము పెరిగినదా ?"

18] "నేను చేసిన పనిని సరిగ్గా ఆలోచించి చేసానా? లేక కేవలము ఊహాగానముమీద చేసానా ??"

19] "కాలము, ఖర్చులు, ఆదాయబడ్జెట్ తయారు చేయుట, విషయములలో ఏదైనా తేడా వచ్చినదా ?"

20] "వృథా కాలయాపన చేసానా? చేస్తే.... ఎంతకాలము వృథా అయి వుంటుంది ?? ఆ కాలమును మరో విధముగా, లాభసాటిగా వినియోగించి వుండవచ్చును కదా ? ?"

21] "నేను నిజముగా డబ్బు, కాలము వృథా చేసివుంటే.... వాటిని తిరిగి సరిచేసుకుని, కర్తవ్యమును సాధించుట ఎలా ?"

22] "నా ఇష్టమునకు వ్యతిరేకముగా- నేను ప్రవర్తించానా ?"

23] "నాకు చెల్లించబడిన మూల్యమునకు తగినంత పని చేయగలిగానా? అంటే.... నా సర్వీస్‌కు నేను తీసుకున్న పైకమునకు తగిన న్యాయమును చేయగలిగానా ?"

24] "ఎవరి పట్లైనా- అన్యాయముగా, దురుసుగా ప్రవర్తించానా ? అలా ప్రవర్తించి వుంటే.... ఏ సందర్భములో అది జరిగినది ?"

25] "నేనే యజమానినైతే.... తీసికొన్న పైకమునకు, నా సేవలకు తృప్తిపడి వుండేవాడినా ?"

26] నేను చేస్తూ వున్న పనికి- నేను పనికొస్తానా ? ఇదే నాకు సరియైన వృత్తిగా భావించాలా ? నేనిందుకు పనికిరానా ??"

27] నా సేవలకు- యజమాని తృప్తి చెందాడా ? లేదా ? ఇంకా నేను చేయవలసినది వున్నదా ?"

28] నేను చేసిన పనికి- పొందిన విజయమునకు సరిపోయిందా ? చాలలేదా ?" నిష్కర్షగా మీకు మీరే విమర్శించుకోండి ! ఎవరూ మీ పనిని గురించి విమర్శించనక్కరలేదు. మీ పని మీకే తెలుసు ! మీ ఆత్మ సాక్షి- మీరే సమాధానము చెప్పుకోండి ! ఇతరులకు మీరు సంజాయిషీ చెప్పనక్కరలేదు. మీ పని మీకు నచ్చితే.... అందరి విషయము మీకు అనవసరము ! మీకు నచ్చితే.... అందరికీ నచ్చినట్లే భావించండి ! "ఇతరులకు నచ్చినదా? లేదా ?" అని ఆలోచించుట అనవసరము ! ముందు మీ విషయము చూచుకోండి ! ఈ విధముగా మీరు ఆత్మవిమర్శ చేసుకుంటే.... మీరొక చక్కటి ప్లాన్‌కు- భవిష్యత్కార్యక్రమములను తయారు చేసికో వచ్చును.

# డబ్బు సంపాదించువారి కుండవలసినవి

మీ కోరికను 'డబ్బు'గా మార్చుకోవాలంటే.... మీకు పట్టుదల, దీక్ష తప్పక వుండాలి. పట్టుదల లేకపోతే.... ఏ చిన్న పని కూడా అవదు. దీనికి ఆత్మశక్తి వుండాలి. దానినే "విల్‌పవర్" అన్నారు. కోరికకు- విల్‌పవర్‌ను చేరిస్తే ... మీరు అనుకున్న పనిని సాధిస్తారు. డబ్బు సంపాదించుటకు కఠినతనము కావాలి. మెత్తగా వుంటే.... లాభములేదు. కఠినత్వము వుండాలి. మిమ్ములను, మీ కాఠిన్యమును చూచి చాలమంది అడ్డంకు ప్రయత్నములను, విరమిస్తారు.

ఎక్కువమంది- ఏ చిన్న అడ్డంకి ఎదురైనా.... తమ కార్యములను వదలివేస్తారు. ఇది చాల తప్పు ! అడ్డంకులు- చిన్నవైనా, పెద్దవైనా వాటిని ఎదుర్కోవాలి. ముందుకు పోవాలి. "పదిమందీ మన గురించి ఏమనుకుంటారో"నన్న ఫీలింగ్ వుండకూడదు. మనము డబ్బు సంపాదిస్తూ.... పైకి వస్తూ వుంటే- ఎందరో తమ అసహనమును చూపుతారు. ద్వేషభావమును ప్రదర్శిస్తారు. మనము వాటిని అసలు పట్టించుకోకూడదు మనకు మన ధ్యేయము తప్ప.... మరొకటి దృష్టికి రాకూడదు. "మంచి చెడు" అంటూ కూర్చుంటే... మనిషి ఏ పనీ చేయలేదు. అలాగని "అందరినీ

మోసము చేయమ"ని, "దోపిడీ చేయమ"ని కాదు. ఋజుమార్గములో, పట్టుదలతో, దీక్షతో, ఆలోచనతో, తెలివి-తేటలతో, ఔచిత్యముతో, ఔదార్యముతో, పట్టు విడుపులతో, సహనముతో, ఓర్పుతో నీ ధ్యేయమును సాధించుకోవాలి. విసుగుదల, కోపము, ఈర్ష్య, ద్వేషము, పగ పనికి రాదు. ఎల్లప్పుడూ నవ్వుతూ వుండాలి. నీ పనిని మాత్రము మఱచి పోరాదు. పట్టుదల వుండాలి. అనునిత్యము "డబ్బు సంపాదన" అన్న విషయమును గుఱించి మాత్రమే ఆలోచించాలి. మరో తలంపు రానే కూడదు. బీదరికమును గుఱించిన ఆలోచనలు రాకూడదు. బీదరికమును గుఱించిన ఆలోచనలు వస్తే.... డబ్బు సంపాదన కుదరదు. "డబ్బు సంపాదించాల"నుకున్నప్పుడు 'డబ్బు సంపాదించు ఆలోచనలు' తప్ప... ఇతర ఆలోచనలు మదిలోకి రాకూడదు.

## పట్టుదలకు కావలసిన లక్షణములు

1] మీ ధ్యేయము ఏమిటో.... నిర్దిష్టముగా తెలియాలి, దానిని సాధించు ఉద్దేశ్యము వుండాలి.

2] మీలో- "ధ్యేయమును సాధించాల"న్న తీవ్రమైన కోరిక వుండాలి.

3] మీమీద మీకు నమ్మకము, విశ్వాసము వుండాలి.

4] మీ ప్లాన్స్ క్లియర్‌గా వుండాలి.

5] మీరు సాధించదలచుకున్న ధ్యేయము తాలూకు విజ్ఞానము మీకు పూర్తిగా వుండాలి.

6] సహకార భావన మీలో పూర్తిగా వుండాలి.

7] 'విల్ పవర్', ఆత్మ విశ్వాసము వుండాలి.

8] 'అలవాటు' వుండాలి. 'అలవాటు' పట్టుదలకు ప్రాణము వంటిది. అలవాటు చేత మీకేపనైనా సులభమౌతుంది. ఏది సాధించాలన్నా.... ముందుగా దానిని మీరు అలవాటు చేసికోవాలి. మీకు ఏ విషయలోను 'అనుమానము', 'భయము', 'అపనమ్మకము', 'ఉద్రేకము' వుండకూడదు. వీటినన్నింటినీ జయించుట గాను మీరు కొన్నింటిని అలవాటు చేసికోవాలి.

[illegible] 'ఫాడ్' వేస్తూనుండే శత్రువులుంటారన్న విషయమును గుర్తించాలి

## ధనార్జనాపరులకు సూచనలు :

1] "మీకు కావలసినదేమిటి ?" దీనిని ముందుగా తెలిసికోండి !

2] పనియందు జాప్యము ఎంతమాత్రము చేయరాదు.

3] మీకు కావలసిన విషయమును గురించిన పూర్తి వివరముల సేకరణ అతి ముఖ్యము !

4] అనిశ్చయము, నిర్ణయము తీసుకోలేకపోవుట అనర్థములు !

5] పని కాకపోవుటకుగల కారణములను- సాకుగా వెదకుటను మానాలి.

6] పనియందు ఆత్మ సంతృప్తిని కలిగి వుండాలి.

7] ఎవరిని లెక్కచేయకపోవుట, గర్వము పనికిరాదు.

8] ఇతరులను నిందించరాదు. సఖ్యతగా వుండాలి.

9] ఓటమికి కారణము కాదు. కోరికలో- బలము లేకపోవుట, దృఢ సంకల్పము లేకపోవుట.

10] అడ్డంకులు రాగానే.... తప్పుకొని, ప్రయత్నమును విరమించుట అన్నది పనికిరాదు.

11] సరియైన ప్లాన్ లేకుండా ఏ పనీ ప్రారంభించరాదు.

12] అవకాశములను వదలుకొనుట అవివేకము !

13] సంసిద్ధతను ప్రదర్శించాలి. కేవలము బదులు ఆశించుటే పనిగాదు.

14] "ఉన్నది చాలునులే" అన్న సంతృప్తి, బీదరికమును గురించిన ఆలోచించుట, "ధనవంతులు కావాల"న్న సంకల్పము లేకపోవుట మంచిది కాదు.

15] పరిస్థితికి తగ్గట్టి దారులను అన్వేషించాలి.

16] "ఇతరులు విమర్శిస్తారేమోన"న్న భయము పురోగమించనీయదు. దీనిని విడనాడాలి. మీరు పురోగమించాలంటే....విమర్శలకు భయపడకూడదు

# డబ్బు సంపాదించు వారికి- మనోధార్ఢ్యత వుండాలి

"మానసిక దార్ఢ్యత (పవర్ ఆఫ్ ది మైండ్)" అన్నది డబ్బు సంపాదించుటకు బాగా ఉపకరిస్తుంది. కార్యములోకి రాని ప్లాన్లు; ఆలోచనలు వ్యర్థము ! మీరెంత తెలివిగా ప్లాన్ వేసినా.... వాటిని ఆచరించుటకు మనో ధైర్యము వుండాలి లేకుంటే మీరు వేసిన ప్లాన్స్ అన్నీ వృధా అయినట్లే ! మీ ఆలోచనలతో- మమ్మూర్తులా సహకరించే వ్యక్తులనే మీ వద్ద వుంచుకోవాలి. మీతో సహకరించని వారిని దూరముగా వుంచాలి.

డబ్బు సంపాదించుటకు మనోధైర్యము వుండాలి. సంపాదించిన డబ్బును నిలువ ఉంచుటకు ధైర్యము వుండాలి.... ఖర్చు చేయుటకు- ధైర్యముతో పాటు తెలివి-తేట ఉండాలి.

## ధనార్జనకు తెలివి-తేటలు కావాలా ?

"తెలివి-తేటలంటే.... "విజ్ఞానము!" అంటే M.A. వంటి చదువు కాదు. ప్రపంచములో బ్రతుకుట తెలియుట ! మరీ తెలివైన వారెందుకు పనికిరారు. మరీ తెలివి తక్కువవారు కూడా పనికిరారు. దీనికి కావలసినది సుమారు తెలివి-తేటలు, గుండె ధైర్యము, సమ్మతము, అనుభవము "ప్రయోగము చేద్దామ"నే అభిలాష, అభినివేశము, 'మాస్టర్ మైండ్' వంటివి వుండాలి.

ఏ వ్యక్తి కూడా 'మాస్టర్ మైండ్' లేనిదే రాణించలేడు 'మాస్టర్ మైండ్' అంటే కరెక్ట్ ప్లానింగ్, కరెక్ట్ కో ఆర్డినేషన్ మరియు కరెక్ట్ ఎగ్జిక్యూషన్ ? ఈ మూడు కలిసిన దానిని 'మాస్టర్ మైండ్' అంటారు. ఇది కొంతమంది 'లైక్ మైండెడ్', 'డివోటెడ్' వ్యక్తుల మూలముగా సాధ్యపడుతుంది.

**ధ్యేయము కావాలి :** అందరి మనస్సులు ఒకే ఒక ధ్యేయము మీద లగ్నమై వుండాలి. ఘర్షణ వుండరాదు. సయోధ్య వుండాలి.

మహాత్మాగాంధీగారిని ఉదాహరణగా తీసికోండి! రెండువందలకోట్ల మందిని తన ఆత్మశక్తితో తన ధ్యేయము వైపుకు మరల్చగలిగారు. లక్ష్యమును సాధించగలిగారు. తన ఉద్యమమునకు- దైవశక్తిని, నైతిక శక్తిని, జనశక్తిని క్రోడీకరించారు. బ్రిటిష్‌వారిని మన దేశమునుండి పారద్రోలారు. మన జాతికి స్వాతంత్ర్యమును సముపార్జించారు. 'జాతిపిత' అయినారు.

ఎవరు ఈ ప్రపంచములో కష్టపడి సంపాదించినా..... వారిలో చాల మందికి ఒక్కటే ధ్యేయము! అది వారిని నమ్ముకున్న కుటుంబమును సంతోషపరచుట! "వారికి ఎంతోకొంత ఆస్తిని అప్పజెప్పాల"ని తన అనంతరము తన వారు క్షేమముగా వుండాలని వారి తపన!

ఈ సంపాదన వెనుక నున్న వుద్దేశ్యము కుటుంబ క్షేమం! స్త్రీ సంపర్కము కాంక్షించని వాడికి, సర్వసంగ పరిత్యాగికి ధనసంపాదన అనవసరము! అతడు హిమాలయములకు పోయి ముక్కు మూసుకుని, మోక్షప్రాప్తి కొరకు తపస్సు చేసుకుంటూ కూర్చుంటాడు. అతనికి డబ్బు సంపాదనా వ్యాసంగము వుండదు.

"డబ్బు సంపాదించాల"న్న కోరిక గలవారిలో- చాలమందికి స్త్రీ వ్యామోహం వుండి తీరుతుంది అది లేనిదే డబ్బు సంపాదించాలన్న కోరికే పుట్టదు. "ఎవరికోసము ఈ సంపాదన? "తన కోసమే!" అనుకుంటే పెద్దగా కష్టపడడు.

మానవునికి జీవితములో- సెక్స్ ఇంపల్స్ అనేక రకములుగా ప్రకోపిస్తూ వుంటాయి. దీనివలన మానవునిలో ఉత్సాహము, సృజనాత్మకశక్తి, తీక్షణమైన కోరిక మొదలైనవి ఉద్భవిస్తూ వుంటాయి.

## మనోస్పందన కారణములు

1] సెక్స్ కోరిక;

2] ప్రేమ;

3] కీర్తిదాహము, "డబ్బు సంపాదించాల"నే తపన, "పదవిని అలంకరించాల"నే ఆకాంక్ష;

4] సంగీతాభిమానము,

5] "స్నేహము చేయాలనే తీవ్రమయిన తపన (అది స్వజాతి స్నేహము కానివ్వండి ! విజాతి స్నేహము కానివ్వండి !);

6] భగవత్పరమైన ఆధ్యాత్మిక ప్రేరణ;

7] శిక్షపడిన వ్యక్తివలె బాధపడుట;

8] ఆటోసజెషన్స్,

9] మనిషికి ఎక్కడా లేనంత భయము కలుగుట,

10] మత్తుమందులను తీసికోవాలనే తపన. ఇవి మనోస్పందనలు!

అన్నింటికన్నా పెద్దది- సెక్సుకోరిక ! సెక్సు కోరిక తీరితే.... మానవుడు ఎంతటి ఘనకార్యమునైనా.... అతి సులువుగా చేయగలడు.

అదే విధముగా తనకు కావలసిన డబ్బు అందితే.... ఎంతపనినైనా ఇట్టే చేయగలడు. కోరిక తీరగానే.... మైండ్‌కున్న చక్రములు ఫ్రీగా ముందుకు సాగిపోతాయి. పైన చెప్పిన వాటిలో 8 మాత్రము సహజమైనవి! ప్రకృతి సిద్ధమైనవి. నిర్మాణాత్మకమైనవి. మిగతా రెండూ వినాశకరమైనవి.

"జీనియస్" అంటే ఎలాగుంటాడు ? : పొడగాటి వెంట్రుకలు, చిత్ర విచిత్రమైన ఆహారము, ఒంటరి జీవనము, హాస్యాస్పదమైన వ్యక్తిగా కనిపిస్తాడు. అతని ఆలోచనా విధానమే వేరుగా వుంటుంది. మనవంటి సామాన్యులకు అందుబాటులో వుండదు. వారికి 'అతీంద్రియ శక్తి' వంటి ఆరవశక్తి వుంటుంది. దీనిని "సిక్స్త్‌సెక్స్" అంటారు.

కార్యసాధన- స్త్రీ ప్రభావము : స్త్రీ వ్యామోహము వలన అనేకమంది అనేక ఘనకార్యములను సాధించగలిగారు. నెపోలియన్ బొనాపార్టీ అందులో ఒకడు! అతని మొదటి భార్య 'జోసెఫిన్' చెప్పిన విధముగా చేసి వుంటే.... బాగుండేది. కాని.... ఆమె మాటను పెడచెవిని పెట్టాడు. 'సెయింట్ హెలీనా'లో అపజయమును పొందాడు.

అదే విధముగా జూలియస్ సీజర్ - తన భార్య 'కాల్పూరియా' చెప్పిన సలహాను పాటించక.... ప్రాణము మీదకు తెచ్చుకున్నాడు. మార్చి, 15వ తేదీన- "సెనేట్‌కి పోవద్దు"ని చెప్పినది. కానీ.... సీజర్ "ఆడదాని మాటలు వినడ మేమిటి ?" అని తృణీకరించాడు. సెనేట్‌లో- అతని స్వంత మనుష్యులే ఆతనిని వధించారు. ఆడదాని ప్రలోభమునకు లోబడనివారంటూ వుండరు. అందులో ప్రముఖులైనవారు- జార్జ్ వాషింగ్‌టన్, నెపోలియన్ బోనాపార్టీ, విలియమ్ షెక్స్‌ఫియర్, అబ్రహామ్ లింకన్, రాల్ఫ్ వాల్డో ఎమెర్సన్, రాబర్ట్ బరన్స్, థామస్ జెఫర్‌సన్, ఎల్బర్ట్ హెబ్బర్డ్, ఎల్బర్ట్ H. గారీ, ఉడ్రోవిల్సన్ జాన్, H. పేటర్ సన్, ఆండ్రూ జాక్సన్ మరియు ఎన్రికో కరూసో వీరేకాదు.... భారత దేశములో ఎందరో వున్నారు. ఆడుదానికి లోబడినవారే వీరందరూ! ప్రముఖ రాజకీయ నాయకులు, గొప్ప కళాకారులు, మంచి సాహిత్య వేత్తలు, మహా శాస్త్రజ్ఞులూ స్త్రీకి లొంగినవారే! "స్త్రీ ప్రభావమునకు ఉత్తేజితులుకాని పురుషులు అరుద"ని చెప్పవచ్చును. ఒకరో, ఇద్దరో వున్నా... వారు అతీతులు! ఐతే ... స్త్రీ వ్యామోహమునకు లోబడి పశుత్వ ధోరణికి దిగిపోకూడదు.

## సెక్స్ ఇంపల్స్ వున్నవారే... ధనార్జన పరులా?

పురుషులలో- నలభై సంవత్సరములలోపు వారికి- వ్యక్తిగతమైన మేగ్నెటిజమ్ దాగి వుంటుంది. వీరిలో 'సెక్స్ ఇంపల్స్' బాగా వున్న వ్యక్తులు- మంచి బిజినెస్ మెన్స్‌గా చెలామణి కాగలరు. వీరియందు ఒక రకమైన 'లైంగిక అయస్కాంత శక్తి' వుంటుంది. వీరు జనబాహుళ్యము లోకి తొందరగా చొచ్చుకొని పోగలరు. కావలసిన పనిని- అతి చాకచక్యముగా పూర్తి చేసుకుని రాగలరు.

వీరిలోని శక్తి- 1] కరచాలనములో తెలుస్తుంది. 2] వారి మృదు మధుర కంఠములో తెలుస్తుంది. 3] వారి శారీరక నిర్మాణములో జ్యోతక

మౌతుంది. వారు నడిచే విధానములోను, కూర్చునే పద్ధతిలోను, వారి మూవ్‌మెంట్స్‌లోను తెలుస్తుంది. 4] వారి ఆలోచనా విధానము ప్రత్యేకముగా వుంటుంది. 5] వారి డ్రెస్సింగ్ పద్ధతిలో ప్రత్యేకత వుంటుంది. వారి ఆకారమునకు, రంగుకు, అలవాట్లకు తగిన విధముగా డ్రెస్ చేసుకుంటారు.

సేల్స్‌మెన్‌కు ముందుగా కావలసినది మంచి రూపము! తరువాత మంచి మాటకారితనము! సెక్స్ ఇంపల్స్ లేనివారు- సేల్స్‌మెన్ కాలేరు. అదే విధముగా పబ్లిక్ స్పీకర్స్, ఆరేటర్స్, మత బోధకులు, లాయర్స్, సేల్స్‌మెన్ మొదలైనవారికి- మంచి రూపముతోపాటు; వేషధారణతో పాటు- మంచి మాటకారితనము వుండాలి. దీనితోపాటే 'వశీకరణము (హిప్నొటైజింగ్ టెక్నిక్)' కూడా వుండాలి. వీటితో ఎంతవారైనా సరే... మీ ముందు జోహారే !

వీటితోపాటు మనము ఎవరితోనైనా కాంటాక్ట్ పెంచుకోతలచుకుంటే.... వారిని గురించిన అవగాహన, అభిరుచుల కనుగుణముగా ప్రవర్తించగలిగి వుండాలి. అవతలవారికి ఇష్టంలేని వాటిని గురించి అక్కడ ప్రస్తావనము తీసుకుని రాకూడదు. మాటకారితనము వలన మనలోని 'సెక్స్ ఎనెర్జీని అవతలి వ్యక్తిలోనికి మనము ట్రాన్స్‌ఫర్ చేయగలిగి వుండాలి. సెక్స్ ఇంపల్స్‌ను- సేల్స్‌మెన్‌లు- వారి సేల్స్ ప్రమోషన్ నిమిత్తము ఉపయోగపరచాలి. సెక్స్ ఇంపల్స్‌ను నేరుగా అవతలి వ్యక్తిమీదకు ప్రసారము చేయకూడదు. అది అవతలి వారికి జుగుప్సాకరముగా వుంటుంది.

"సెక్స్ ఇంపల్స్ వ్యక్తికి హానికరము" అనే అపోహ ఒకటి వున్నది. అది నిజముకాదు. కేవలము అపోహ మాత్రమే! సెక్స్ ఇంపల్స్ జీవితములో ఎంతో ఉపయోగపడుతుంది. వ్యక్తిని బాగా ఉచ్చదశకు తీసుకుని వెళుతుంది.

కొందరు 'సెక్స్ మేడ్‌మెన్స్' వుంటారు. వీరి ధోరణి ప్రమాదకరము! ఇటువంటివారికి సెక్స్‌లో తీవ్రమైన పరిణామములు గోచరించి, సెక్స్‌లో అతిగా పాల్గొనుట, వికృతరూప భావములను ప్రదర్శించుట చేస్తుంటారు. ఇవి వ్యక్తిత్వమునకు హానికరము! సెక్స్‌లో పాల్గొనుట వేరు! సెక్స్ ఇంపల్స్‌ను- ట్రాన్స్‌మ్యూట్ చేయుట వేరు! రెండింటికీ చాల తేడా వున్నది. ఐతే ... ఈ రెంటికీ వున్న వ్యత్యాసము చాలమందికి తెలియదు. దీనివలన అపోహలకు లోనై జీవితములను పాడు చేసుకుంటున్నారు.

సెక్స్ వ్యక్తికి ఆనందమునే కాదు ... ఆరోగ్యమును కూడా ప్రసాదిస్తుంది. జీవితమును తేజోవంతము చేస్తుంది. దీనివలన ఆనందమయ జీవితమును గడుపుతారు. ఇందులో ఎంత మాత్రము సందేహములేదు.

## ధనార్జన చేయువారికి బ్రైన్ కావాలి

డబ్బు సంపాదించుటకు ఆనందము, ఆరోగ్యముతోపాటు- మనిషికి తెలివి-తేటలు కావాలి. తెలివి-తేటలన్నవి 'బ్రైన్'లో వుంటాయి. "బ్రైన్" అంటే మెదడు!

మెదడు- ఆలోచనలను అందుకుంటుంది. ప్రసారము చేస్తుంది. అంటే 'రిసీవింగ్ స్టేషన్' మరియు 'బ్రాడ్‌కాస్టింగ్ స్టేషన్' కూడా మెదడే!

"డబ్బు సంపాదించాల"ను 'కోరిక'ను పుట్టించేది- 'మెదడు'! దీనికి అవసరమైన పరికరములను సమకూర్చేదికూడా మెదడే! అనుక్షణమూ- మనము చేయవలసిన పనులను గురించి గుర్తుచేసేది, ప్రోత్సహించేది 'బ్రైన్'! వాటిని మనము నెఱవేర్చేదాకా వెంటవుండి మనలను తరిమేది 'బ్రైన్!' కనుక... డబ్బు సంపాదించుటకు 'బ్రైన్'కు చాల సన్నిహితమైన సంబంధము వున్నదన్నమాట! 'బ్రైన్' యొక్క సూక్ష్మమైన వివరములలోకి పోతే.... మన 'బ్రైన్' పోతుంది. అవి ప్రస్తుతము మనకు అవసరములేదు.

టెలిపతి : "అవతలి వ్యక్తి మనము చెప్పినదానికి అనుగుణ

ముగా ప్రవర్తిస్తున్నాడా ? లేదా ?" అన్న విషయము మనకు ముందుగానే సూచనప్రాయముగా తెలుస్తుంది. దీనినే "టెలిపతి" అని, "క్లైయిరో వాయన్స్" అని అంటారు. అవతలివారి మెదడును- ముందుగానే స్టడీ చేయుటకు, వాటివలన మనకు కలిగిన తాత్కాలిక స్పందనల కనుకూలముగా మన మెదడును ట్యూన్ చేయుటను "టెలిపతి" అంటారు. ఇది అరుదుగా కొంతమందికి వుంటుంది. అందరికీ సాధ్యపడేది కాదు. అంత తేలిక అయినదీ కాదు. నేర్చుకుంటే అలవడేదీ కాదు. ఎవరూ నేర్పించ గలిగినదీ కాదు. వ్యక్తులకు అంతర్గతముగా అలవడేది ఈ అతీంద్రియ శక్తి!.... "అవతలి వ్యక్తి- మనలను గురించి ఆ క్షణములో ఏ విధముగా అనుకుంటూ వున్నాడు ?" అనే విషయము తెలిస్తే.... మన పని పూర్తి అయినట్లే! ఇది 'టెలిపతి' వున్నవారికే సాధ్యపడుతుంది. టెలిపతి- కొంతమందికి జన్మతః అలవడితే.... మరికొందరికి అనుభవము మీద అవగాహన అవుతుంది.

**ధనార్జన కాటంకమగు శత్రువులు :** మనలో ముఖ్యముగా ఆరుగురు శత్రువు లున్నారు. వీరి వెనుక మరో ముగ్గురు వుండి, వీరిని నడిపిస్తున్నారు. వీటిని గురించి మనము అధ్యయనము చేయాలి. విశ్లేషణ చేయాలి. అవగాహన చేసికోవాలి. ఆ మూడు కారణములు ఏమిటి?

ఒకటి "సందిగ్ధావస్థ" అంటే చేయవలసిన పనిని నిర్ధారించుకోలేక పోవుట! రెండవది "సందేహము" అంటే.... ప్రతీ విషయమును సందేహించుట! అంటే.... "దేనినీ నమ్మకపోవుట" అన్నమాట! మూడవది- "భయము". అంటే.... దేనిని చూసినా.... "అది మనకేదో హాని చేస్తుంద"న్న భయము! ఈ మూడూ- మన పురోగమనమునకు ప్రథమ శత్రువులు! ఈ మూడూ వున్నచోట- "సిక్త్సెన్స్" వుండదు. అంటే.... 'క్లైయిరో వాయిన్స్' పనిచేయదు.

'సందిగ్ధావస్థ' భయమునకు మూలము! సందిగ్ధావస్థ అనుమానమునకు దారితీస్తుంది. 'సందిగ్ధము', 'అనుమానము' కలిస్తే.... భయము' అవుతుంది. ఈ ముగ్గురూ ప్రమాదకరమైన శత్రువులు!

'భయము'లో నుండి మరో ఆరుగురు శత్రువులు బయటకు వస్తారు. 'విచారము', 'ఈర్ష్య', 'అనారోగ్యము' ఈ మూడూ మనిషి మానసిక ఒత్తిడులకు కారణభూతమైనవి.

"డబ్బు లేకపోతే బ్రతుకుట ఎలా?" అనే భయము, "ఇతరులు విమర్శిస్తూ వుంటే బ్రతుకుట ఎలా?" అనే భయము, "ఆరోగ్యము దెబ్బ తింటే బ్రతుకుట ఎలా ?" అనే భయము వీటి అన్నిటికీ మూల కారణము భయము! ఆ 'భయము' పోవాలి.

"మనలను ఆదుకొని, ప్రేమించే వారే లేర"ను భయము, వయస్సు ఎక్కువైపోతుందే"నను భయము, "మరణము"ను గురించిన భయము ఇవే మేజర్ భయములు! మిగతావన్నీ మైనర్ భయములే !

భయము అన్నింటికీ మూలము మానసిక వైవిధ్యము, మానసిక ఒత్తిడి. ప్రశాంతత లేకపోవుట !

మనిషిలో 'భయము' పోతేనే తప్ప.... అతడు ప్రశాంతముగా జీవించలేడు. అనుకున్న పనిని సాధించలేడు. ఎవరితోనూ సంప్రదించనూ లేడు. ఎవరిని చూచినా అనుమానము, "పని జరగదేమోన"ను సందిగ్ధము వీటి పరిణామమే- 'భయము'!

డబ్బు దేనికి ? "మీరు డబ్బును గురించే ఎప్పుడూ మాట్లాడతా రెందుకు? మరో విషయము మీకు పట్టదా?" అని అడిగాడొక మిత్రుడు !

"డబ్బే ప్రపంచమునకు మూలము నాయనా! డబ్బులేనిదే ఎవ్వరూ కూడా ఈ ప్రపంచములో ఏ పనినీ సాధించలేరు 'ధనంమూల మిదం జగత్' అన్నారు కదా! అంతేకాదు.... తండ్రీ, కొడుకుల మధ్య అనుబంధము తెంపేది ఈ డబ్బే ! మరణహోమాలకు మూలము ఈ డబ్బే! ఈనాడు ప్రపంచమును పాలిస్తున్నది ఈ డబ్బే! 'డబ్బులేని వాడు డుబ్బుకు కొరగాడు' అన్నారు కదా పెద్దలు !"

"డబ్బు బాగా సంపాదించండి! దానితోనే గౌరవము, దానితోనే పదవులు, దానితోనే సర్వస్వము లభిస్తుంది. "కష్టపడకుండా డబ్బు సంపా

దించాల"ని అనుకోకండి! కష్టపడి నిజాయితీగా సంపాదించండి! దుర్మార్గ మును విడనాడండి! సన్మార్గములో సంపాదించండి!

డబ్బు....! డబ్బు....!! డబ్బు!!! "మనిషికి అదే మూలము! అదే జీవితము!! అదే మోక్షము!!!" అని నేను చెప్పాను.

"మీరు డబ్బుకు మోక్షమునకు ముడిపెట్టారేమిటి?" అన్నారు.

"డబ్బుంటే.... పుణ్యకార్యములను సాధించగలుగుతారు. పుణ్య క్షేత్రములను సందర్శించగలుగుతారు. పుణ్యాత్ముల సేవలను చేయగలుగు తారు. పుణ్యకార్యక్రమముల మూలముగా మీకు పుణ్యము లభిస్తుంది. ఆ పుణ్యము వలన మోక్షము ప్రాప్తిస్తుంది. కనుక ... మోక్ష సాధనకి 'డబ్బు' అవసరము ఉన్నది. ఇది నిర్వివాదాంశము" అని అన్నాను.

కనుక.... ఆలోచించండి! ఆస్తిని సంపాదించండి! ఆనందించండి! ఆదర్శప్రాయులు అవండి! అందుకే కావలసినది డబ్బు! అన్నిటికీ మూలము డబ్బు! శాంతియుతముగా జీవించుటకు డబ్బు కావాలి. యుద్ధము చేయుటకు డబ్బు కావాలి బ్రతుకుటకు డబ్బు, చచ్చిపోయిన తరు వాత దహన క్రియలకు కూడా డబ్బే కావాలి. కనుక.... డబ్బు లేనిదే బ్రతుకుట దుర్లభము! డబ్బు జీవితమునకు ప్రాణము వంటిది.

"మానవుడు ప్రశాంతముగా జీవనము గడుపుటకు ఎంతవరకు డబ్బు కావాలో.... అంతవరకూ సంపాదిస్తే చాలు!" అనేవారు కొంద రుంటారు.... "మనము జీవించుట కాదు.... మనలను ఆశ్రయించి, మన పైన ఆధారపడిన వారు జీవించుటకు కూడా డబ్బు చాలా అవసరము!" అంటారు.

నెపోలియన్ హిల్, ఏండ్రూ కార్నేగి వంటి మేధావులు- డబ్బు సంపాదించుటకు అనేక సూత్రాలను మనకు అందించారు.

"ధనమేవ జయతే!"

ధనముతోనే సర్వత్రా జయము లభిస్తుంది. ధనము మానవ జీవన యానమునకు ఇంధనము !

— ★ —

# చివరి మాట !

ఈ ప్రపంచములో బ్రతకడానికి డబ్బు ఎంత అవసరమో ? అది సంపాదించడానికి నీతి-నిజాయితీలు కూడా అంతే అవసరము. ఉదయము లేవగానే డబ్బు సంపాదనకొరకు మానవుడు పడే శ్రమ, తాపత్రయము, అది సాధ్యపడకపోతే.... అతడు పొందే ఆవేదన తలచుకుంటే- సృష్టి ఎంత విచిత్రమైనదో అవగాహన అవుతుంది. కొందరి అభిప్రాయములో "డబ్బు సంపాదన తెలిసికేకానీ.... అది సంపాదించే విధానమే కష్టము" అంటారు. డబ్బును మనము సంపాదించాలి. కానీ.... డబ్బే సర్వస్వము కాకూడదు. మానవతా విలువలను మంట కలిపే సంపాదనా విధానము మంచిది కాదు. డబ్బు మనిషి అవసరములను తీర్చేదిగా వుండాలి. "అవసరము"అంటే.... "కనీస సౌకర్యము"లని అర్థము. మనిషికి కావలసిన 'కూడు, గూడు, గుడ్డ' ఇవి వుంటే.... మనిషి సంఘమునకు తోడ్పడుతూ.... ఆదర్శప్రాయముగా జీవించగలడు. అవసరములకు మించి ఆర్జన వుంటే.... అది విలాసాలకు దారితీస్తుంది. విలాసాలకు వినియోగించే విత్తము చిత్తక్షోభను కలిగించే అవకాశము ఉన్నది.

డబ్బు సంపాదించుటలో న్యాయమైన, నీతివంతమైన మార్గమును సూచించడమే ఈ చిన్ని గ్రంథము యొక్క అవసరము ! "పైసా మే సబ్ దునియా హై (డబ్బులోనే ప్రపంచమంతా వున్నది)" సూర్యుని చుట్టూ- భూమి తిరుగుతూ వుంటే.... భూమిచుట్టూ రూపాయి తిరుగుతూ ఉన్నది. నిజానికి రూపాయకు తిరిగితేనే విలువ ! ఒక్క దగ్గరే స్థాణువుగా వుండిపోరాదు. డబ్బుకు సర్క్యులేషన్ వుంటేనే విలువ ! విద్యా వ్యాపార రంగములలో దానికున్న ప్రాముఖ్యత ఇంతా- అంతా కాదు !

"ప్రపంచములో బ్రతుకుటకు డబ్బు కావాలి. కాని.... ఆ డబ్బే ప్రపంచము కాకూడదూ" అనేదే ఈ గ్రంథము అందించే సందేశము !

ఈ పుస్తక రచనలో అమూల్య సహకారమును అందించిన శ్రీ నేరెళ్ళ లక్ష్మణరావుగారికి, జొన్నలగడ్డ లలితాదేవిగారికి మరియు కడారు ఉమామహేశ్వరరావుగారికి మా కృతజ్ఞతలు ! — రచయిత,

— ప్రకాశకులు